శ్రీహరిః

సీ. శ్రీధరాస్థలిలోన • జెన్నొందు వేల్లలూ
ర్పురియందు వసియించు • పుణ్యకరుఁడు
చిల్లరవంశాబ్ధి • శీతకరుండయి
స్వప్రజ్ఞజనుల సం • భ్రమమొనర్చ
సమితకీర్తివిశాలుఁ • డార్యసన్మాన్యుండు
ఆంధ్రగీర్వాణంబు • లందు నిపుణుఁ
డయిన వేంకటకృష్ణ • రాయాభిధానుండు
కేశవశతకమీ • [illegible]ప్రేమ
నచ్చువేయఁగడంగె • నానందకరమైన
బుద్ధివల్లనుఁ బూర్వ • పుణ్యమునను

తే.గీ. నట్టి ధీమంతుగుణవంతు • నమితదాంతుఁ
కీర్తి చంద్రార్కస్థాయిగాఁ • బఱపివారి
వంశమును వృద్ధిచేయుమో • వారిజాక్ష
పరగనీపాత్రమును భూత • పంచకంబు
యుండువఱకును స్థిరముగా • నుండునట్లు
చేయుమో దేవ కేశవ • శ్రీరమేశ.

ఇట్లు,
గ్రంథకర్త.

ఓం శ్రీమదాంజనేయపరబ్రహ్మణే నమః

కంబెపూడి

పాఠకమహాశయులారా ! సోదరులారా!

"కేశవా" అనుమకుటముతో శతకమును బూర్తిఁ జేసి ప్రకృతము మనయాంధ్రలోకమునకు సమర్పించిన మహాకవి నామము సర్వపండితజనశ్లాఘ్యము. అనుస్మరణీయము. తక్కిన కవిలోకమునకుఁ బలెనాయననుఁ గూడ సామాన్య మానవునిగ బరిగణించుకొననేల తగదని కొందఱకు తప్పక సంశయ మొదవితీరు. అట్టితఱి నీ పరిపూర్ణప్రకాశుని పవిత్ర వంశచరిత్రను త్రికరణశుద్ధిగ, దోషైకదృక్కులుగాక, సుహృచ్ఛబ్దమును సార్థకపఱచుకొన నుద్దేశించి, పఠించినచో, నట్టిసంశయభూజము కూకటివేరులతోఁ బెల్లగిలి, యానందలతచిగిర్చి బ్రహ్మానందఫల మొదవితీరు. అన్నలారా! గుంటూరు జిల్లా, వినుకొండ తాలూకా ముప్పాళ్ళయనఁ బరగుమాస్వ గ్రామమునకును, ప్రకృతకథానాయకులగు మహాకవిగారి స్వగ్రామమగు సీకంబెపూడికిని, గడుంగడు సామీప్యమయ్యు మదీయపర్యటనమున నెన్నడును దటస్థించని గ్రామమగుటచే శ్రీయుతుల మహాత్మ్యను గమనించుటకవకాశము కలుఁగదయ్యె. ఇట్టియెడ, క్షయవత్సర పుష్య, మాఘమాసములు రెండును, రేపల్లె, తెనాలి తాలూకాలలో పర్యటన మొనర్పదలంపు గలిగి, బయలుదేరి, యీగ్రామసమీపమునకు నశ్వశకటముతో అక్కవచ్చుటదటస్థించె. అట్టియెడ, బ్రహ్మశ్రీ నాగండ్ల కోటిలింగాచారిగారనునొక విశ్వబ్రాహ్మణకులశిరోభూషణుండును

కొమ్మూరి రామలింగమను చర్మవా[illegible] శిరోమణిసుతుండు
గురామదాసనునతండును, నాకడకరుదేరి యమితానురాగ
మునుగనుపఱచిరి. ఆపయి, శ్రీఆచారిగారు నన్ను వారింటికి
గొనిచనిరి. అంతగొంచెము కాల మామిత్రచూడామణియింటిక
డ నివసించి, ప్రాస్తావిక విషయములు మాటలాడుచుంటి. ఇం
తలో శ్రీయాచారిగారు, హరికథా కాలక్షేపమొకటిమాయూ
రజరవుడనికోరి, నాచేనొప్పించుకుని, యాపై బ్రహ్మశ్రీ మ.
రా. రా. శ్రీ కొట్టపాటి వేంకట సుబ్రహ్మణ్యకవి శిరోరత్నము
గారియింటికి నన్నుబిలుచుకొని వెడలిరి. అంత శ్రీవారి
దర్శనము చేసికొనిన యనుక్షణమే కేవల సాత్విక
పరమహంస స్వరూపులగుటచే, నేనును శ్రీవారి
ద్వితీయ సుకుమారునిబోలె వారిసేవలంజేయ నిచ్చగలిగి,
యహర్నిశములును శ్రీవారి మహత్తునే యభినందించు
కొనుచు, వారి వాఙ్మాధురిమనేగ్రోలుచు, వారియింటనే నివ
సించుచు శ్రీవారు రచించిన కేశవశతకముపై మదీయభక్తి
తాత్పర్యముల నుపోద్ఘాతమనుపేరుతో వెల్లడించదలంచి,
యీమాత్రము రచించి యికమీద శ్రీవారి పవిత్రవంశ చరి
త్రను లిఖించనుంకించి, దీనినింతతో విరమించుచున్నాడను.

బ్ర. శ్రీ. మ. రా. రా. శ్రీ కొట్టపాటి మల్లయాభిఖ్య
సత్కవి వరేణ్యవంశ పవిత్ర చరిత్ర ప్రారంభము దిక్ప్రదర్శన
ముగా మనవి చేసికొనెద.

శుభమస్తు. శ్లో॥ జననీ జన్మ సౌఖ్యానాం-వర్ధనీకుల సంపదాం
పదవీపూర్వ పుణ్యానాం-లిఖ్యతేజన్మపత్రికా॥

ధాతనామ సంవత్సర కార్తీక బ ౮ శనివారము ౧౨-౨౫ ఆర్ద్ర ౮౨-౨౩ సిద్ధం ౧౭-౧౧ బా ౧౨-౨౫ ది ౨-౩౨ తులా సంక్రమాణం ఘ ౮-౨౬ చ ౧౮ యీ శుభదినమందు రాత్రి ౧౨౪ మీదను కర్కాటకలగ్న మందు కొట్టపాటి సోమరాజుకు పుత్ర జననం.

శ్రీ తత్కాల గ్రహాణ నిర్ణయః విశాఖా ౨ అర్కః స్వా ౩ కుజః స్వాతి ౧ బుధః జ్యేష్టా ౮ గురుః జ్యేష్టా ౨ శుక్రః శ్రవణ ౧ ఋజ్వే శనిః రోహిణీ ౧ రాహుః అనూ రాధా ౩ కేతుః

భాగవతంలోను ప్రధమ ఆకున కొట్టపాటి సోమన్న కుమారుఁడయిన మల్లయ్య జన్మపత్రికె అని తెలుసుకునేది.

## నిర్యాణము

నందననామ సంవత్సర చైత్ర శుద్ధ ౮ ఆదివారము-పండిత వరేణ్యులారా! ఏతద్గ్రంధకర్త గారగు శ్రీ శ్రీ శ్రీ కొత్రపాటి వేంకట సుబ్రహ్మణ్య కవితల్లజుని జనకులగు శ్రీ మల్లికార్జున కవిగారి జననకాలమును, నిర్యాణకాలమును మాత్ర మీ పీఠికలోఁ గనుపరచితి. ఇంకను శ్రీవారి పవిత్ర జీవితమున జరిగిన మహాత్తుల నన్నిటిని వివరించునెడ, నదియే యొక పెద్ద సంపుటముకాఁగలదు- అందుచే నమ్మహాద్భుతయము లన్నిటినిఁ దేటతెల్లముగ నుదహరించుచు, నద్దానికి శ్రీ మల్లికార్జునకవిజీవితమను నామమిడి ప్రకటించ నెంచియున్నా డ. మహాకవి వరేణ్యులును, నద్వైత శాస్త్ర నిపుణులును,

యోగాభ్యాసనిరతులును, భగవత్ప్రసాదమును పడసిన పర
మభాగవత శిరోమణులును, కీర్తిశేషులగు శ్రీవారిచరిత్రను క
ర్ణాకర్ణికగా నెదియేని విషయమును పూర్వపక్ష సిద్ధాంతమునొ
నర్చ్పతటిగాని, మనలఁగన్నతల్లిదండ్రులేది యేనిమహత్తు నభి
వర్ణించుచుండు సమయమునఁ గాని వినియేయుందురని నాక
ట్టినమ్మకము. అటులవినుట తటస్థించని సోదరులు నాచేఁ బ్రక
టింపఁ బడనుండు జీవితచరిత్రను దిలకింతురేని నర్వమునువిశ
దమగు-అట్టిమహత్తు యింతవఱకును, ప్రకృత గ్రంధకర్తగారి
యెడలను వర్తిలుచున్నదని చెప్పుట కొంతమాత్రము వెనుకం
జనేయను. గ్రంధకర్తగారియొక్క-రిస్థితిమాత్రమేయని వ్య
ష్టిగమనవిఁ జేసికొనుటయు, మహాపరాధమే. వీరువారననేల! శ్రీ
వారి స్వకుటుంబ లతయంతయు నిర్విఘ్నముగనే పుష్పించుచు
న్నదని చెప్పుట సమంజసమగుటచే నటులమనవి చేసికొనుచు
న్నాఁడ. ప్రకృతకలి మహారాజాశ్రితకోటికి వీరిభవనముః కారా
గారము. ప్రకృత కవిరాజకోటికి వీరిగృహము పుస్తకభాండా
గారము. ప్రకృత ధర్మసంగ్రహచిత్తులకు వీరినిలయము శాంతి
నికేతనము. ప్రకృత పూర్వాచార పరాయణులకు వీరిసదన
ము 'ఆనందసాగరము'

అగుటచె దర్శించి, భాషించి, నివసించి, విమర్శించిన
సుహృదులకుగోచరము. తదితరులకగోచరము.

ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః

శ్రు ॥ సత్యమేవ జయతేనాఽనృతం।

శ్రు ॥ ధర్మఏవహతోహంతి. ధర్మోరక్షతి రక్షితః॥

# గ్రంథకర్తృస్తుతి.

సీ. శ్రీకంటెపూడి పు • రీవరేణ్యంబేమ
    హాత్మునియావాస • మై వెలసెనొ
శ్రీమల్లికార్జున • కామమాంబాసుసం
    తానమేఘునుఁడయి • ధరనలరెనొ
శ్రీకొట్టుపాటిభూ • రికులాంబురాశిపూ
    గాంకుడే ధీరుడై • కడుఁ బ్రబలెనొ
శ్రీకోటమాంబికా • హృదయాంబుజావాసు
    డే ధీరవర్యుఁడై • యిలవెలిగెనొ

తే.గీ. మల్లికార్జునరాయాఖ్య • మహితధీరు
    తాతయై యేవదాన్యుండు • ఖ్యాతిఁ గనెనొ
యట్టివేంకటసుబ్బరా • యాఖ్యగురుని
    పాదపద్మద్వయమ్ము నేఁ • బ్రస్తుతింతు.

సీ. ఏమహామహుఁడుర • చించినపొత్తముల్
    కవులకులక్షణో • ద్గ్రంథములగు
ఏజ్ఞానమూర్తిబో • ధించిన సద్బోధ
    సద్యోఫలితమయి • సరిగఁ గ్రాలు
ఏతపోధనుఁడువ • చించినవాక్యమ్ము
    శ్రుతిసదృశంబయి • శోభగాంచు
ఏపండితుండను • ష్ఠించినశాంతిస
    ర్వజగత్ప్రకాశమై • వఱలుమిగుల

తే.గీ. నామహాత్ముఁడె కొట్టుపా • ట్యన్వవాయుఁ
    డట్టివేంకటసుబ్బరా • యాఖ్యగురుని

పాదపంకేరుహమ్ముల ◆ స్వాంతమందు
నిలిపిపూజించుచుందున ◆ న్నిరతిగందు.

మ. సరదార్లందఱు భేషుభేషనుచు లం ◆ చంబిట్టిదోపట్టిలో
క్కరవంతైననుఁదప్పఁజేయకయును ◆ రాచకార్యముల్ శ్రద్ధమై
జరుపన్ నీసరి లేరటందురతివి ◆ శ్వాసమ్మునన్ గాంచుచున్
గరణాలందఱిలోన నీనుడులవిం ◆ నన్ బాపముల్ బాయుగా
వర శ్రీవేంకటసుబ్బరాయకవిసం ◆ భావ్య భవచ్ఛిష్యుఁడన్
ధరయందున్ హనుమంతరాయకవియన్ ◆ నామమ్ము నంగాంచినీ
స్మరణన్ నిత్యమొనర్చువాఁడనటు బ్రే ◆ మన్ శ్రోతువో నమ్మితిన్.

క. కుతుకమున భవత్పితృజీ
వితమునఁ బ్రాయంగనాన ◆ పెద్దగఁగలిగెన్
సతతమునామదినివసిం
చి తితయశమ్మునువహించఁజేయువె తండ్రీ॥

గీ. వసుధపై క్షయవత్సర ◆ పౌష్యకృష్ణ
దశమిభృగువాసరమ్మున ◆ తవపదాబ్జ
సన్నిధిని పంచరత్నముల్ ◆ శ్రద్ధతో స
మర్పణము జేయరచియించి ◆ తార్యగొనవె.

ఇత్థం

28-1-27

భవద్విధేయపరమాణుః
గోపాలుని హనుమంతరాయశాస్త్రి.

# పండితాభిప్రాయములు

---

గుంటూరు తాలూకా చినకోండ్రుపాడు నివాసియగు
కొండ భోగిభూషణరావుగారిట్లు వ్రాయుచున్నారు.

సీ॥ శ్రీహరినేప్రొద్దు • చిత్తంబులోన ని
శ్చలభక్తిఁబూజలఁ • జల్పువాఁడు
సుఖదుఃఖములను జూ • చుచు మోదఖేదముల్
సమముగా భావించు • విమలగుణుఁడు
బురదంటనీని కు • మ్మఱపురువు భాతిసం
సృతినుండిరాగతఁ • జెడనివాఁడు
భక్తియే ప్రధాన్య • పథముగానెంచుచుఁ
గవనంబులల్లెడు • కవివరుండు
తే॥ గీ॥ భక్తికోలఁదిని గేశవ • శతకమిదియ
చెప్పెఁ బింగళిసత్కుల • సింధుచంద్రుఁ
డనెడు వేంకట సుబ్బరా • యాభిధుండు
సుకవులార! దయనుదీనిఁ • జూచుకొనుఁడు.

ఇట్లు విబుధవిధేయుఁడు
కొండ భోగిభూషణుఁడు
6—8—1917.

గుంటూరు తాలూకా చినకొండ్రుపాడు నివాసియగు బలభద్రపాత్రుని వేంకట సుబ్బయ్యగారిట్లు వ్రాయుచున్నారు.

సీ॥ కేశవశతకంబు ♦ కల్బిమరహితమై
భగవంతుమహిమల ♦ బరిఢవిల్లు
సారాంశములనెల్లఁ ♦ జక్కఁగా సమకూర్చె
పరమభక్తులకెల్ల ♦ భక్తిపఠన
మునకనుదగియుండు ♦ ఘనశతకంబును
వనజాక్షశతార ♦ వసుధలుండు
వఱకువర్ధిలుఁగాత ♦ వారిజాక్షునిదయ
హరినామస్మరణంబు ♦ మఱవకెపుడుఁ
తే॥ గీ॥ జేయుపింగళివంశాబ్ధి ♦ సింధుతిలకుఁ
డనఁగ వేంకట సుబ్బరా ♦ డ్ఘనకవీంద్ర
విరచితంబైన దిదిచాల ♦ వేడ్కఁదనరెఁ
దుదివఱకుఁ జూడనామది ♦ ముదముజెందె.

ఇట్లు విబుధవిధేయుఁడు,
బలభద్రపాత్రుని వేంకటసుబ్బయ్య,
బోర్డుస్కూల్‌మాస్టరు.

---

సత్తెనపల్లితాలూకా ద్రొడ్లేటి నివాసియగు భీమారెడ్డి వేంకటప్పారెడ్డిగారిట్లువ్రాయుచున్నారు.

చ॥ అవిరళభక్తిసీమునఘుఁ ♦ డార్యవశీకరణౌషధంబు కే
శవశతకంబుభక్తజన ♦ సంతతపాఠనయోగ్యమిట్లువ్రా

సె విషధరేశశాయిమృడు ♦ శీతలదృక్కులదీనిఁగాంచియీ
భువివెలయించుఁగాత! ఁబరిపూర్ణకృపామతినెల్లకాలమున్.
శా॥ శ్రీగోదావరితీరవాసుఁడగునా ♦ సీతేశు సేవించి యా
భోగానందము చక్రధారిశతకం ♦ బున్ గేశవాభిఖ్యము
ద్యోగంబౌ శతకంబు నర్పణముగా ♦ నుర్విన్ సమర్పించె నా
యోగానందుఁడు ప్రోచు నీకవినజే ♦ యోల్లాసముం గూ
ర్చుచున్.

ఇట్లు సజ్జనవిధేయుఁడు
భీమారెడ్డి వేంకటప్పారెడ్డి.
27-7-1919

---

గుఱ్ఱము వీరగోపాలకృష్ణానాథ శరణాలయోపాధ్యాయులగు నందిగామ శేషయ్యగారిట్లు వ్రాయుచున్నారు.

ఉ॥ ఎవ్వనిసంస్తవంబునను ♦ నెవ్వనిసత్కథలాలకింపఁగా
నెవ్వనిపూజసేయుటను ♦ నెవ్వనిభక్తినమస్కరింపఁగా
నెవ్వనిమూర్తిఁగాంచినను ♦ నెవ్వనిపేరుపఠించినంత నే
యవ్వలికేఁగునోయఘము ♦ లాపరమేశ్వరుఁడోము నీకవిన్.
సీ॥ నలినాక్షిరో! నీదు ♦ నామమెయ్యెడియన్నఁ
జక్కఁగానాగేటి ♦ చాలుఁజూపు
రమణిరో! నీవున్న ♦ రాజ్యమెచ్చటనన్న
రాచిలుకనెక్కెడు ♦ రాజుఁజూపు
సుదతిరో! నీకెన్న ♦ సుతులెందరెయటన్నఁ
దమిమీఱఁదనదునే ♦ త్రములఁజూపు

వనజాస్యరో! నీదు • జననిపేరేమన్నఁ
జిఱునవ్వు నవ్వుచు • శిరమువంచుఁ
తే॥ గీ॥ గులముఁజెప్పుమన్న దంతముల్ • గొఱికిచూపు
నట్టి నేర్పరియైనట్టి • యమలచరిత
కవనిజాతకుఁబతి రాముఁ • డరసియెపుడుఁ
జెలఁగి రక్షించుచు నీకవిన్ • సిరులొసంగి.

చం॥ సిరులిడు, భక్తినింగలుపు, • శ్రేయముఁగూర్చుఁ, గవిత్వతత్త్వమే
యెఱుఁగఁగవచ్చుఁ, బుణ్యముల • నెంతయునిచ్చు; భవంపుఁ జీకటిన్
దఱుఁగఁగఁజేయుఁ, గేశవుని • ధర్మచరిత్రకథాప్రశంసముల్
కరమును నేర్చు, విష్ణుశత • కంబిది చూచి పఠింపఁగోరెదన్.

కం॥ అంకితమిడి కేశవునకుఁ
బొంకము గా వ్రాసెదీనిఁ • బొందఁగ యశమున్
వేంకట సుబ్రహ్మణ్యము
పంకజనాభుండు ప్రోచు • వడినిడి సిరులన్.

ఉ॥ ఆసుమబాణుతండ్రిశత • కాభిధగ్రంథముఁ గాంచి పాపముల్
వాసితి, భక్తినామసుధఁ • బానముచేసితి నన్నిచోట్ల ను
ల్లాసము మీఱఁ గేశవుని • లక్షణముల్ వినుతింపఁ జూచి నే
వ్రాసితిఁ బంచరత్నముల • వారిత భాగ్యమునీయఁ గోరుచున్.

పిల్లుట్ల,
పల్నాడు తాలూకా.

ఇట్లు బుధజనవిధేయుఁడు,
నందిగామ శేషయ్య.

బాపట్లతాలూకా వెల్లలూరు నివాసియగు చిల్లర వెంకటే
శ్వర్లు అష్టావధానిగారిట్లు వ్రాయుచున్నారు.

కం॥ వేంకట సుబ్రహ్మణ్యశ
శాంకా! వందనశతంబు! • లయ్యాకృపనా
యంకమున కంపుశతకముఁ
గొంకక చేకొంటిహితముఁ • గొంటిన్ మంటిన్॥

ఉ॥ చూచితిగ్రంథమంతయును•జోద్యముగాఁగనుపట్టినట్టిమీ
ధీచతురత్వసంపదకుఁ • దేకువకున్ ముదమందినాఁడనా
లోచనచేసియెల్లజను • లున్ హరిభక్తివహింత్రుగాకఁబా
పాచలవజ్రికేశవుఁ డు•యాచితసౌఖ్యములిచ్చి ప్రోచుతన్

ఆ॥ వె॥ కాసువీసములకు • నాసించిఖలులకుఁ
గృతినొసంగుకవుల • గతినిజనక
భక్తిరసమునించి • భగవంతునకు శత
కంబు నొసఁగియశము • గాంచితనఘ!

ఇట్లు,

చిల్లర వేంకటేశ్వరకవి,
అష్టావధాని.

బాపట్లతాలూకా వెల్లలూరు నివాసియగు
చిల్లరఅయ్యవరావుగారిట్లు వ్రాయుచున్నారు.

శా॥ శ్రీరామాంఘ్రిసరోజయుగ్మగతహృ ♦ త్సీమాఖ్యస
ద్బంభరా!
భారద్వాజమునీంద్రగోత్రతిలకా!♦బ్రహ్మణ్యమూర్తిగుణో
దారా,పింగళివంశవారినిధిచం ♦ ద్రా వైదుషీభూషితా!
సారాచారుఁడకంటెపూడినగరీ ♦ శా! బుద్ధివాచస్పతీ॥

కం॥ జటిలంబగు మీకవితా
పటిమకునబ్బురముఁజెందె ♦ భావంబత్యు
త్కటముగ వరపింగళివేం
కటసుబ్రహ్మణ్యధీర ♦ కవితాధారా!

ఉ॥ శైలిమనోహరంబుపద ♦ జాలముపొందికయొప్పు,భక్తికిన్
మూలము,నీతిగౌరవ ము॰ మోఘము,జ్ఞానధనంపుపేటి, దో
షాలినిదూలఁజేయగల ♦ యట్టిసుదర్శనచక్రమెల్లను
శ్రీలనొసంగులక్ష్మియర ♦ రే!భవదీయకవిత్వమెన్నఁగన్.

సీ॥ తారకమంత్ర మా ♦ ధారంబుగాఁజేయ
దశరథపుత్రుఁడే ♦ దైవమయ్యె
గీతారహస్య మం ♦ గీకారముంజేయ
యదునందనునిపొందు ♦ విదితమాయె
నగరాజపుత్రిని ♦ నమ్మియుండుటకెన్న
ఫాలనేత్రుఁడుప్రేమఁ ♦ బరవఁజేసె

వాయుకుమారుండు ♦ వందితుండౌటచే
సహజపాండిత్యంబు ♦ సాగఁజే

తే॥గీ॥ శమదమంబులరెంటిని • జక్కఁజేసి
జగతిఁగుమ్మరివుర్వ్యాగా • నెగడుచుండి
రాజయోగంబునందున ♦ రమణకెక్కి
వఱలుచుండెడిధీరాత్మ • వందనములు.

తే॥గీ॥ నిర్గుణాత్ముండునిత్యుండు ♦ నిర్వికారుఁ
డప్రమేయుం డజేయుఁడు ♦ హర్షదాయి
శాశ్వతైశ్వర్యకీర్తినా • సంగ్రపోచుఁ
గాత! మీకృతినెపుడు సం • ప్రీతితోడ.

ఇట్లువిబుధవిధేయుఁడు,

చిల్లర అయ్యావరావు,

వెల్లలూరు.

హరిః ఓమ్.

# కేశవశతకము

శా॥ శ్రీరామాయని పల్కు కీరమునకుం • జిద్రూపముం జూపవే
వారాశింజవలీలదాఁటుకపికిన్ • వైరాగ్యముంగూర్పవే
సారోదారువిభీషణాఖ్యు నడవే • సంపూర్ణలంకాపురిన్
మీరున్నాకు నాసంగరే యటువలెన్ • మీనామముం గేశవా! 1

ఉ॥ ఈశ్వర!నీకు మ్రొక్కితి ద•యించుము ధరేశ్వర! భక్తపోషలో
కేశ్వర!యబ్జజాండమటు• కేలునఁదాల్చినఫాలనేత్ర! యో
గీశ్వర! కైటభేంద్రధర! • కీశనుతేశ్వర! భోగిభూష! భూ
తేశ్వర! శంబరారిహర! • దేవగణేశ్వర! కావు కేశవా! 2

చం॥ వనజభవాండసంచయము • వాస్తవమొప్పఁగ సృష్టిఁ జేసి యా
వనజదళాక్షుపంపునను • వాసికి నెక్కిన వాణిఁగూడి నా
మనమున నిల్చి మోక్షమును • మానుగ నీయవె శారదాపతీ
యనఁగను నీవెయాధరణి • నంబుజనేత్ర! ప్రకాశ కేశవా! 3

చం॥ కలుములనిచ్చు తల్లియని • గాటపుభక్తినుతింపు భార్గవిన్
జలము మఱేమిలేక ఘన • సాధ్వని నీదగు నిందిరామణిన్
నిలువఁగఁ జేసియెల్లపుడు • నిక్కముగా నిల సౌఖ్యసంపదల్
పలుమఱు నీయఁ దెల్పవెయ • వారిగనాతు మురారి కేశవా! 4

ఉ॥ వాణికిఁ బుస్తకాగ్రణికిని • వజ్రపుఁగాంతులు గల్గునట్టి గీ
ర్వాణికి,సర్వశాస్త్రయుత • వాణికి, భారతికిన్ ,సువీణబల్
పాణిని మీటునట్టి ఘన • పద్మజురాణికి, నెల్లవేళలం
బాణులు మోడ్చి మ్రొక్కెద న • పారతరంబగు భక్తిఁ
గేశవా! 5

చం॥ హిమగిరిపుత్రి, పార్వతికి• నిష్టమొనర్చెదునిందుధారికిఁ
గ్రమముగ మ్రొక్కి యీభువిని • గబ్బములన్ రచియింప
నామదిన్
భ్రమజనియించెనందులకు • భద్రమునీవయి కావవేసదా
కుమతులు సేయు హేళనలు • కుంభినిలో హరియించుఁ
గేశవా! 6

చం॥ వరగిరిజాతపుత్రునకు • వామనమూర్తికి, సాధువర్తికే
శిరమునఁ బ్రాల్చి మ్రొక్కితిని • సృష్టిని నేనొనరించు
కావ్యమున్
గురుతరమైన వాక్పటిమ•గుంభనమిచ్చెదు వాక్యసిద్ధికిన్
నిరత మవిఘ్న మొప్పుటకు•నిన్నుస్తుతించితిఁగాదె కేశవా!7

ఉ॥ వ్యాసుని నిర్జితేంద్రియుని•వాసుని ధీరగుణోత్తమాంగ స
ద్భాసుని, సర్వశాస్త్రయుత • భాసుని, నిత్యప్రమోద
మానసో
ల్లాసుని, జక్రహస్తపద • లాలసధ్యానుని, బుణ్యకాశికా
వాసునిగూర్చి యెల్లపుడు • వందనముల్ మఱిఁజేతుఁ
గేశవా! 8

ఉ॥ భారత రామసత్కథలు ♦ భాగవతంబును జెప్పినట్టి యా
ధీరులనన్నయాదులను ♦ దివ్యవచోరచనాప్రవాహులన్
ధారుణి జీవితంబులను ♦ ధన్యతసల్పిన కీర్తిశేషులన్
సారెకుఁ గొల్చెద మొక్కెదను ♦ జక్కని శైలిని నీయఁ
గేశవా! 9

చ॥ హరుని పదాంబుజాతముల ♦ నాత్మను జేర్చి భక్తితోడ సు
స్థిరముగు మోక్షకాంతపడ ♦ సిద్ధికినై తపమాచరించుచున్
దురితులఁ జేరకే పరముఁ ♦ దూరిన మామక జన్మహేతువై
వగగిన తండ్రికే నతులు ♦ బాగుగఁ జేసెదనయ్య కేశవా! 10

—* దశావతారములు *—

ఉ॥ ధాత్రియు నిద్రఁ జెందనలు ♦ ద్విధమతయుఁ గాంచి నీవు నా
చేతన మెల్లఁ గుత్సిపడి ♦ చెచ్చెఱ నీటను నోడనిడ్చుచున్
ఖ్యాతి వహింపి ముజ్జగముఁ ♦ గాచితివో ఘనమత్స్యమూర్తివై
భూతదయామయుండవని ♦ భూతములున్ని నుఁజాటఁ గేశవా! 11

శా॥ హారా వారముఁ ద్రచ్చుచుండఁ గనుహా ♦ భారంబుచే శైలమూ
వారాశింబడ క్రుంకుచుండుటకనీ ♦ వంతన్ విచారించి యో
శూరా! సినరిగాన మంచ నిమిషుల్ ♦ స్తోత్రంబులుం జేయఁగూ
ర్మారూఢిం ద్రుణలీలనెత్తివెవడిన్ ♦ మాంధాద్రి నిం గేశవా! 12

మ॥ కనకాక్షుండు మహిం జుట్టి విశ్వతలమున్ ♦ గంగాస్థలిం ద్రోయఁగన్
గని వేగంబుగఁ గ్రోడరూపమున వే ♦ ఖండించి యా దైత్యునిన్
ఘనవార్ధింబడియున్న కాశ్యపిని వే ♦ దక్కన్నిల్పవే నీటపై
సనకాదుల్ నినుఁ గాంచ నెంతెలఁ ♦ సర్వేశ్వరా! కేశవా! 13

మ॥ సురలందున్ మనులందుఁ బెక్కడుమలం ◆ జూపించు పేకాక శ్రీ
నిరపేక్షుండును నిశ్చలుండు సుగుణా ◆ సీకుండు నాపుత్రు నిం
బరిమార్పం గలదుష్టమార్గచయముం ◆ బాపాత్ముఁడై
వల్వఁగన్
నరసింహాకృతిఁ దాల్చి త్రుంచితివి వి◆ న్నాణంబుగాఁ గేశవా! 14

ఉ॥ వాసవుఁ బాఱఁ దోలి దివి ◆ వైభవమంతయు దైత్యులందఁగా
మోసము వచ్చెనంచ సుర ◆ ముఖ్యుని వేఁడి పదత్రయంబు నీ
వాసురలోకనాథునకు ◆ నాదిమభోగములొందనీయవే?
దోసము వాయనా బలిక ◆ ధోవిభవంబిడ లేదె? కేశవా! 15

ఉ॥ రాజులమూర్ధసంఘములు ◆ రమ్యముగా సురలోకమేఁగఁగా
రాజగుణాభిరామ భృగు ◆ రాముఁడవై తగ మెట్లు మెట్లుగాఁ
దేజము మీఱఁగ ట్టిధరఁ ◆ దీవ్రతఁ గశ్యపమౌనికిచ్చి వే
రాజిలు సత్తపోవనికి ◆ రంజిల నేఁగితివయ్య కేశవా! 16

ఉ॥ రావణుఁడన్ దురాత్ముఁ డుధ◆ రాత్మజ సీతను లంకఁ జేర్పఁగాఁ
గావరమున్ వహించిదశ ◆ కంఠుని గూల్చి విభీషణాఖ్యునిన్
ఠీవిగ నిల్పి లంకవిభు ◆ ఠీవిని నొప్పియయోధ్య కేఁగవే
దేవ కపీశయుక్తముగ ◆ దిక్కులు పిక్కటిలంగఁ గేశవా! 17

మ॥ యదువంశాంబుధిఁ బూర్ణచంద్రరుచితో ◆ నా దేవకీ
సాధ్వికిన్
విదితంబౌ ప్పు జనించి ధాత్రిఖలులన్ ◆ వేవేగ మేత్రుంచియా
పదలం బెట్టిన కంసుఁ ద్రుంప వెవడిన్ ◆ బ్రహ్మాదులు న్మెలనన్
దుదకున్ భూమిభరంబు మాన్పి చనవే ◆ తోరంబుగాఁ
గేశవా! 18

మ॥ అసురుల్ పెంచ్చి పురంబులాకసమునం ♦ దారూఢిగాఁ గట్టిబల్
కసిదీఱన్ మునులైనవాఁజపముల్ ♦ గాల్దన్నఁగాఁ గ్రోధివై
విసుగుం జెందక బుద్ధరూపకుఁడవై ♦ వేవేగ దైత్యావళిన్
రసికత్వంబున ద్రుంచి వేసితివహో ♦ రాజేంద్ర! శ్రీ కేశవా! 19

మ॥ కలిరాకం గని క్రూరులోడక వసిం ♦ గామాంధులై సాధులం
గలఁతంబెట్టఁగ వారిఁ ద్రుంచు కొఱకు ♦ గ్రత్వంబునన్ భూమిలోఁ
గలిరూపాఖ్యధరించి శత్రువుల వే ♦ ఖండించి యామీఁదటన్
గలినిన్ బద్ధుని జేసినాఁడవు గదే ♦ గాఢంబుగాఁ గేశవా! 20

చం॥ అరమఱ లేక కొల్చు కరి ♦ నప్పుడె కావఁగ లేదె సద్దయన్
నిరతము నమ్మినట్టి యల ♦ నీరజవాసిని కీవె వక్షమున్
వరదుఁడవై యొసంగవో కో ♦ వాలి ధరందిననాథుపట్టికిన్
బరువకినాకు నట్లొసఁగు ♦ బాగుగ నీవద నేవఁ గేశవా! 21

ఉ॥ భీకర మొప్ప రావణుని ♦ బింక మడంచి వధింపలేఁగదే
చేకొని వానరేశ్వరుని ♦ జెచ్చెఱఁ ద్రుంచ వెయింద్రసూనునిన్
డీకొని తండ్రిఁ జంపినడి ♦ డింభకుఁ గావఁగ లేదె ప్రేమతో
నీకు సమాను లెవ్వరిల ♦ సర్వపయ ప్రభ! ధీర! కేశవా! 22

మ॥ వినయంబింతయు లేక నీయెడలవి ♦ ద్వేషుండు భోజుండు తా
ననయాంబున్ దురితంబులే సలిపి వాఁ ♦ డంతంబుఁ బ్రాపింపఁడే!
నినుడెందంబున నిల్పినట్టియమగుల్ ♦ నిత్యత్వముం గాంచరే!
నినువీక్షింపక మానవాళనులుగ్లా ♦ నిం జెందరే కేశవా! 23

చం॥ విజయుని పూని కిందీర్చఁగదు ♦ వేడ్కఁ జనించుటఁ గృష్ణమూర్తివై

నిజముగుశౌర్యయుక్తముగ • నిల్చినశాత్రవయోధులందఱన్
భుజబలమొప్ప నీవపుడె • పోరినిఁగూల్పఁదలంచికర్తికిన్
విజయసమాఖ్యనిచ్చితివి • వేల్పులుమేలనుచుండఁ గేశవా! 24

చం॥ గుహుఁడు మహానుభావుఁడును • గోర్కులులేని విశుద్ధమార్గుఁడున్
బహుజనమిత్రభావుఁడును • బంధవిముక్తుఁడు బ్రహ్మతేజుఁడున్
సహనముఁగల్గువాఁడుఁగడు • శాంతముతో నటియించుచుండియున్
రహినినుఁగొల్చి కాదొకొ తి • రంబగు మోక్షముఁగాంచెఁ గేశవా! 25

చం॥ ధ్రువుఁడనుచిన్నవానిధృతి • తూలఁగనాపినతల్లిమాటికిన్
జెవులవినంగరాని కడు • చెడ్డగుమాటలఁ దూలనాడినన్
దివిరివనంబుఁ జేరియటు • దేవమునీంద్రుఁడు నారదాహ్వయుం
డవిరళమంత్రమిచ్చుట ను • హామహమోక్షముఁగాంచెఁ గేశవా! 26

ఉ॥ కాననభూమియందుఁ దన • కాయమునమ్మక యెల్లవేళలన్
మానితమొప్ప నాశబరి • మాధవ! నీపదచింతఁ జేయఁగా
మానిని మెచ్చి నీవె చని • మాయఁదరించెడునట్టిదైన నీ
స్థానముఁ జేర్చుకొంటివహ • చక్కఁగ నాసతి నెంతొ కేశవా! 27

మ॥ గజరాజిద్ధరవంతరాత్మను నినుం • గాంక్షించి పూజింపఁగాఁ
గుజని గ్రాహముఁ గాంచి త్రుంచియు వడిన్ • గుంభీంద్ర
మున్గావవే?
యజరుద్రాదులు సంస్తుతింపఁ గరి న • త్యార్యాఢి రక్షించి నీ
నిజరూపంబును జూపి ముక్తినిడవే • నిక్కంబుగాఁ గేశవా! 28

ఉ॥ ఏఁశిముకుందుఁడంచు మిము • హేళనఁ జేసిన రాక్ష
సేశ్వరున్
వేఁశిమితోడఁ జూచి సుర • వేదన లెల్లనడంగఁ ద్రుంచి బల్
పోడిమి మీఱ నీ భజన • భూరిగఁ జల్పిన పుత్రుఁ గావవే!
చూడ వెనన్ను నావిధిని • శోభిత నేత్రముతోడఁ గేశవా! 29

చం॥ సనచరులందు శూరుఁడయి • వారినిధుల్ వడఁకించి
ధీరుఁడై
దినకరు పుత్రు రాజ్యమును • దేవిని గూడ హరించినట్టి యా
యనిమిషనాథసూనుఁడు మ • హాహరిరాజగు వాలిఁ
గూల్చి యా
దినమణి సూనురాజ్యమును • దేవిని నీయవె నాఁడు
కేశవా! 30

ఉ॥ శ్యామలరూపు గల్గి నవ • చంద్రుని బోలిన యాస్య
మొప్పి బల్
హేమపటంబు దాల్చియు స • హేతుకమైన దరంబు దాల్చి నీ
నామము హెచ్చొనర్చి రిపు • నామములెల్లను గూపు
మాపి శ్రీ
రామ సమాఖ్యఁ దాల్చితివి • శ్రద్ధను గావసు రేశ! కేశవా! 31

మ॥ కరుణాసాగర! పూర్ణచంద్రవదనా!♦ కంజాత పత్రేక్షణా!
దురితారణ్యసవారణంబుకొఱకున్ ♦ దోర్వీర్యమౌనట్టి నీ
వరఖడ్గంబును జూపి వైరిబలమున్♦ వంచించి సమ్మూర్తివై
మఱి నా నేరములెల్లఁ బాపి కరుణ♦న్మన్నింపవే కేశవా! 32

ఉ॥ పాలునొసంగలేక నర♦పాలుఁడు మత్తసుయోధనుండు తాఁ
జాలఁగఁ గొన్ని దుస్థితులు♦ జంకక పాండవులందుఁ జేయఁగాఁ
గూలఁగ నేయఁ జేసితివి ♦ కుంభిని నా ధృతరాష్ట్రసూనులన్
లీల జెలంగు నీమహిమ♦ లేశముఁ గాంచఁగలేరు కేశవా! 33

ఉ॥ నాగపురంబునందు జన♦నాథునితో ఘనసంధిసల్పఁగన్
వేగమె వచ్చి యర్ఘ్యములు ♦ వేడ్కను నావిదురుండు సల్పఁగా
జాగొనరింపలేక కొని ♦ చారుతరంబుగ నారగించి యా
రాగవిదూరు నావిదురు♦ రంజిలఁ జేయవె! దేవ! కేశవా! 34

శా॥ కుంతీపుత్రులొనర్చు నధ్వరములోఁ ♦ గ్రోధాత్ముఁడై చైద్యుఁడున్
బంతంబూనుచు నగ్రపూజతమకుం♦బంపంగ వద్దంచుఁ దా
నెంతో పట్టువహించి పల్కఁగని నీ♦వే చక్రధారావళిన్
గంతుల్వేయఁగఁ గొట్టవే వడిఁదలం ♦ గంజాక్ష! యో కేశవా! 35

మ॥ వనమందున్ విహరించు నీవు బలుఁడున్ ♦ వాత్సల్యతన్ గోపులన్

జనితోత్సాహముతోడఁ గాయనపుడా • సద్బ్రాహ్మణస్త్రీలొగిన్
గొనియర్పించిన యన్నభక్ష్యచయముం • కూర్మిన్మహావాంఛతోఁ
దిని యాయుత్తమ స్త్రీలకిచ్చితివిగా • దేవత్వముం గేశవా! 86

మ॥ వలుమాఱు న్నినునమ్మ భీష్మకసుతం • బట్టంపుస్త్రీఁ జేయవే!
యలనాఁడాసభఁ జీరుద్రౌపదికి వస్త్రాళిందయంగూర్పవే!
యలసీవార ధరాత్మజాతకిడవే • యాతారకాఖ్యామృతం
బిలఁ జత్రాతిని నాతిఁ జేయవో గోవాణీశస్తుతా! కేశవా! 87

శా॥ నీపై భక్తిని నిల్పి రేఁగు తెలమి • న్నీయంఘ్రులం గొల్చుచున్
భూపాలోత్తమ! నీవిజృంభణకళల్ • భోగించుచున్ బుద్ధిలో
నాపోశ్చ్యుతినిగాంచి విశ్వమయులై • యాబ్రహ్మసంధానమే
యేపారంగనితన్మయత్వమునఁ దా • రింపొందరే కేశవా! 88

మ॥ జగతింజాలమహాత్మ్యఁ జౌననిసురల్ • చర్చింప సంరూఢిగా
నిగమంబుల్ ఘనభాష్య సూత్రచయముల్ • నిర్మించి వ్యాఖ్యానముం
దగనర్వాంబుగఁ జేసి పండితులు సందర్శించి యీధాత్రిలోఁ
బొగడన్ వ్యాసుడవయ్యు జ్ఞానమయుతం • బొల్పొందితే కేశవా! 89

మ॥ సగరాత్మోద్భవులెల్ల నీదువయికిన్ సక్రోధులై రాఁగ నా
పగతుల్ భస్మము గాఁగ నేత్రయుగళీ ప్రజ్వాలతోఁ జూడవే
పగవారై శరణంబుఁ జొచ్చు జనులం బాలింపవే మిత్రున్
జగతీనాథ! సమంబు నీకు హితముం శత్రుత్వముం గేశవా! 40

మ॥ అలకాధీశుని పుత్రులిర్వురును దా మత్యంత మోహాంధులై
బలిమిన్ రంభను గూడి మత్తులగుచుం బాటిల్లఁగా నారదుం
డలకాఁ బేరుల మద్దులై పడుఁడటం చత్యుగ్ర శాపంబిడన్
బలముం భోగము నమ్మి కూడదుర హా ప్రాణుల్ధరిం గేశవా! 41

శా॥ లంకాధీశ్వరు ప్రోలనిల్వక మహాలజ్జాభరం బొంది నీ
చెంకన్ నిల్వఁగ వచ్చినట్టి యసురన్ శ్రీవిన్వాలోకించి యే
సంకోచంబును లేక యేలితివహా సర్వంసహన్ జూడనో
వంకేజాక్షుఁడవైన నీకు సరియా వద్మాసనుల్ కేశవా! 42

ఉ॥ ఆలవణాబ్ధి దాఁటి మహిమాన్వితుఁడై త్రిగలంకఁ గాంచి యా
బాలను సీతఁ జూచి వనపాలురభంగ మొనర్చి వేగ భూ
పాలుని జేరి తద్విధము పావని తెల్పిన హాసమొప్ప నా
లీలలు నీవె కావె యమలీకృత భావవికాస కేశవా! 43

మ॥ అఖిలంబున్ సృజియింపఁ బెంపఁ జెఱుపన్ హాళీంద్రి మూర్త్యాత్మవై
యఖిలంబందు వసించి సత్వగుణివై యాదిత్య చంద్రాగ్నులన్
సఖ దేవేంద్ర ముఖాష్టదిక్పతుల నీ శబ్రహ్మలం బ్రోచు నీ

ముఖసంపూర్ణ సుధాంశు బింబముగనన్ ♦ మోక్షంబగున్
కేశవా! 44

మ॥ భవమున్ రూపముఁ గర్మముల్ గుణములున్ ♦ భావింప
నీ వేమియున్
భువియందున్ గన లేవటంచు విబుధుల్ ♦ బుద్ధిన్ దగం
దెల్పఁగా
భవదీయాంఘ్రులు నమ్మికొల్చితి సదా ♦ భారంబు
నీదంచు మా
ధవ నేఁ జేతు సహస్రనామములచేఁ బూజలం గేశవా! 45

ఉ॥ నాగపురంబులోన జన ♦ నాథులుఁ బౌరులుఁ గాంచు
చుండఁగా
సాగరకన్యఁబోలు నల ♦ సాధ్విని ద్రౌపది నాసభాస్థలిన్
వేగమె తెచ్చి వస్త్రములు ♦ వీడఁగఁ జేసిన క్రూరులన్ దు:
ర్యోగుల రూపుమాపవె మ ♦ హోత్తమ సద్గుణ
భావ! కేశవా! 46

మ॥ అనయంబున్నినుఁ భక్తిగొల్వఁగను ప్ర ♦ హ్లాదుండనే
నేను నిన్
మనమందున్నతిసల్పఁ బార్థుఁడనె వి ♦ న్నాణంబుగాఁ
బూజలం
దనుపన్ శక్రుఁడనే దయామయుఁడనేఁ ♦ దప్పుల్ వెసం
జేసితిన్
మనమందుంచక యండఁ జేర్చు పరమా ♦ త్మా! దేవ!
శ్రీకేశవా! 47

ఉ॥ చారువిలోచనాంగనలు • చంద్రముఖుల్ పదియాఱు వేలు నీ
భూరిగుణంబు లెన్నకయె • పొందునకొప్పిరిగాని వారు నీ
స్మేరవినీలకాంతులను • జిత్తములం దలపోయకుండినన్
నీరజనాభ! యేలవొకొ • యేగతి నొప్పినవారు కేశవా! 48

మ॥ చలమున్మానక ధాత్రిఁబౌండ్రకుఁడొగిన్ • జక్కాడ నీ ద్వారకం
బలుమాఱు ల్దనసేనఁగూర్చి నడువన్ • భంజించి యా యోధులన్
బలముంగూలిచి రాజుఁగూల్చ నపుడున్ • బత్తేజమా వెంటనే
కలసెన్నిన్ను దివాకరార్చి పగిదిం • గాన్పింపఁగన్ కేశవా! 49

మ॥ నినుడాయంజని పట్టఁబోవు యవనున్ • నీవెంచి యావెంటనే
వనశైలంబులు సాగరాపగలువే • వైరక్రియంద్రిప్పియా
ఘనమా నొక్కబిలంబుఁజేర్ప నతఁడున్ • గాంభీర్యనాదంబుతోఁ
జని యందున్ముచికుందుఁగాంచి యతనిన్ • జంపంగ యత్నించినం
గనులన్ విచ్చిన నీల్గెఁగాదె యతఁడుం • గంజాక్షా! శ్రీకేశవా! 50

చం॥ కరిపుర మందు నీయునికిఁ • గన్గొని సాల్వుఁడు ధాత్రి క్రుంగఁగాఁ

బరిజనమెల్లఁ దోడుకొని ♦ ప్రౌఢిగ ద్వారకఁ జేరినిల్వఁగాఁ
ద్వరగను జేరిద్వారకకు♦దాసియొనర్చిన సాల్వముఖ్యులం
గలకలకంఠముల్నఱికి ♦ కాలుని కిచ్చితివయ్య కేశవా!51

శా॥ నీమీఁదంగరిఁ ద్రోల హాసమొదవన్ ♦ నీవా కరీంద్రోత్తమున్
భూమీశుల్వలదన్నఁబట్టిదివికిన్ ♦ భూచక్రమున్ గ్రుంగఁగా
భూమన్ప్రజ్ఞను ద్రిప్పి తుండమువడిన్ ♦ భోరొక్కల్వఁగా నేయనా
సామోద్ఘ్యాతము ఘీంకృతుల్ నలుపుచుం ♦ జచ్చెంగదా! కేశవా!52

మ॥ సరిగన్ నీవుఁ గుచేలుఁడున్ హితముతో ♦ సాందీప మౌనీంద్రుచే
వరుసన్ విద్యలనెల్ల నేర్వఁ బఠుటన్ ♦ వాత్సల్యతన్ సంపదన్
గరమర్థిన్ గృపసేయ లేదెయపుడున్ ♦ గారుణ్యసంధాయివై
వరదా! చేయవె నీపరోక్షము ననున్ ♦ వర్ధిల్లఁగాఁ గేశవా!53

చం॥ మధురకుఁ జేర్పుమంచు నను♦మానుగఁ గంసుఁడు మీనిమిత్తమై
రథమును బంపెఁ బోదమటు♦రండని కోరి విశేషభక్తితో
నధిపులఁ దోడుకొంచుఁ జను ♦ నప్పుడు నీరము గానువింపగాఁ
బృథివికిడిగ్గిసంధ్యవిధిఁ♦బ్రేమనుసూర్యుని కర్ఘ్యమిచ్చుచో

మధుహర! విశ్వ రూపమును • మంత్రికిఁ జూపితి వౌర!
కేశవా! 54

మ॥గురుసంపత్తుల నేకముల్ గొనెడునీ • కుఁ గాలోటా కో యెుజ్జకుఁ గ
గురుసంపత్తును నీయఁబోవఁ గొన కే • గోవింద! మద్బాలునిం
గరుణం గూర్పుమనంగ నేఁగి యముతోఁ • గంజాక్ష భా
షించి నీ
గురునూనుఁ బ్రతికించి సొందివనికిం • గూర్పింపవే?
కేశవా! 55

ఉ॥ మాలలుచాలఁ జుట్టి రయెుక • మాలికుఁ డిచ్చిన నెల్లఁ దా
ల్చి యా
మాలికు చేత నర్ఘ్యములు • మానుగఁ గైకొని కుబ్జఁ
గాంచి యా
బాలత్రివక్రములన్నఁ గ • భాసిలఁ జేసియు లేపనాదులుం
జాలనలంది యేఁగితివి • సంతసమందుచు మున్ను కేశవా! 56

ఉ॥ రాజున కంబరంబులటు • రాజసభంగొని యేఁగు చాలికన్
రాజసమొప్ప రాఁబిలిచి • రాజపటంబుల నిమ్మటన్న మా
భోజుని చేలముల్ గొనఁగఁ • బూజ్యులె మీ రని
ధిక్కరింపఁగాఁ
దేజమెలర్పఁ గూల్చితివి • దేయని చాకలివానిఁ గేశవా! 57

ఉ॥ భంగమొనర్చి చాపమును • బాహుబలంబున నూరుఁ
గొట్టుచున్
రంగమునందు గర్వమున • రాఁబడుమల్లులముష్టికాదులన్
సంగరమందుఁ గూల్చి యటు • సాధులు బ్రేల్చిన కంసుఁ
జంపియా

తురంగము డొల్ల నేయవా? • యంతకుఁ డెన్నఁగ ధాత్రిఁ
గేశవా! 58

ఉ॥ ధాతయు నిద్రఁజెందఁగను • దానవులౌ మధుకైట
భాఖ్యులున్
ఘాతకబుద్ధిచే విధిని • బాధలొనర్పఁగఁ బూనినంత నే
హేతువుఁగాంచి దైత్యులకు • హెచ్చువరంబుల నీయఁ
బూని మీ
మాతఁటి నేమియిత్తుమన • నెల్లరుఁజావుఁడటన్న వెంటనే
పాతకు లంత మొందిరటు • బ్రహ్మనుగన్నవికాస! కేశవా! 59

ఉ॥ ఏటికిఁ గాయమింక ధర • నిచ్చెద వేగమె దేవకోటికిన్
నాటకసూత్ర మాతనువు • నమ్మఁగరాదది యాడుఁబోవు నీ
చోటుఁ గనంగఁజాలమని • సూటిదధీచివచించి ప్రాణముల్
ధాటిగఁ దత్త్వమార్గమునఁ • దన్మయతన్ జనఁజేసెఁ
గేశవా! 60

మ॥ మకరందంబలరారఁ గ్రోలు నళులా • మర్యాదలం బాయునే?
యకలంకోత్తములైన సత్వగుణులా • యంధస్థితిన్ దాల్తురే
ప్రకటంబొప్ప ధనాఢ్యులున్న కడకున్ • ప్రాజ్ఞోత్తము
లోవ్వదు రే?
సకలంబున్ భవదాజ్ఞచేత నిలిచెన్ • జర్చింపఁగాఁ గేశవా! 61

మ॥ పొసఁగన్ స్వర్ధునివీచికావళులపైఁ • బొందొప్పఁ
గానూఁగుబల్
రసికత్వ ప్రియభావ హంసచయమున్ • రాఁబోవు న
గుంటకున్?

రసనీపాదపయోజ లగ్నమగు స్వాం • తంబొండొరుఁ జేరునే?
భసితాంగుండును నిన్ను నెన్నఁగలఁడే • భావింపఁగాఁ గేశవా! 62

మ॥ అలరంజాత మహీజపల్లవచయం • బాహారమైయుండఁగా
నిలలోఁ గోయిలకొప్పఁగాని తినఁగా • నింకేరికిన్ శక్యమే?
విలసిల్లం నినుఁగొల్చుచుండు ప్రముఖుల్ • వేఱొక్కనిం గొల్తురే?
తలఁపన్ నేనటు నమ్మియుంటిఁ దగ దే • తత్త్వార్థినై కేశవా! 63

మ॥ పలుమాఱున్ శశిచంద్రికల్ మనమునన్ • భావించుమేల్జక్కవల్
తలఁపన్ జిన్నిహిమాంబుబిందువులపైఁ • దారొక్కల్పునే బుద్ధి నీ
యిలపై నిన్ను స్మరించు మానవులు దా • మేచోటికిం బోదురే?
కలనైనన్ నిను వీడలేదు కనవే • కౌసల్యజా! కేశవా! 64

మ॥ అలమేఘాంబువుఁ గ్రోలుజక్కవలు తా • మాయుప్పునీ రానునే?
తిలకింపంగను నాదముల్ వినెదునా • దీర్ఘైన క్రౌంచంబులా
జలముద్ఘోషము నెట్టులోర్చి విను వి • శ్వస్తుత్యమానాము! యీ
యిలనిన్ నమ్మినభక్తకోటి కిడవే • యిష్టార్థముల్ కేశవా! 65

మ॥ కరికుంభస్థితమాంసముం దినెడునా • కంఠీరవం బల్పమూ
కర మాంసంబును గాంక్షసేయునె? సదా • కౌతూహలస్వాంతుఁడై

పరతత్త్వాంచితు నిన్ను భక్తిపరతన్ ♦ భావించుచున్నట్టి ధీ
వరుఁడే భంగి నిఁకొక్కరింగొలుచు? నో ♦ భద్రాద్రిశా
కేశవా! 66

మ॥ బలురోగంబులకెల్లఁ దెప్పవని నే ♦ భక్తిక్రియన్నామముం
దలయుందుర్ ధరియించి సర్వగతులన్ ♦ దంతావళంబట్లు తే
వలపుల్ లేక నిరావలంబముగ నే ♦ వర్ణించితిన్ నీద్యుతిన్
జలమా? యిట్టిదురాశఁ బెట్టనగునా? సర్వేశ్వరా! కేశవా! 67

మ॥ ఇభరాజంబును నెక్కి స్వర్గమును దా ♦ నే పారఁ బాలించినన్
బ్రభ దేవేంద్రుఁడు సృష్టికర్తలగునా ♦ బ్రహ్మాదులున్గాదని
విభవోద్ధత్యమెఱుంగఁ జాలరుగదా! ♦ వేయేండ్లు
తర్కించినన్
శుభమాసీచరితంబు నాకు నిడవే ♦ శుద్ధక్రియా! కేశవా! 68

మ॥ అరయన్ ధాత్రిఁ బురందరాఖ్యపదమ ♦ త్యారూఢిగాఁ
గోరినన్
మఱియా మేరువుఁ బోలునట్టి పసిడిన్ ♦ మర్త్యాళి సాధించినన్
గరిమం బబ్బుట కెట్లు సాధ్యపడు నే ♦ కాలంబులం జూడఁగా
స్థిరతన్ నీవుట భేద నాచ్యుత పద ♦ శ్రీనింపవే కేశవా! 69

చం॥ అమల కుశేశయంబునకు ♦ నంబువులంటని రీతిగాను నో
యమలగుణాఢ్య! నీకు విష ♦ యంబులునంటని భాతిగాను దు
ర్భ్రమలను జిక్కియించుకయుఁ ♦ భారము ముట్టఁగ లేని నన్ను నే
క్రమమునఁ జూచి కాచెదవొ ♦ కౌస్తుభధార! ప్రకాశ!
కేశవా! 70

చం॥ హరునకు నీకు భేదమన ♦ నారయ లేదని వేదశాస్త్రముల్
సరవి వచింపఁ దార్కికులు ♦ సర్వమతంబులు గల్గఁ జేయుచున్

నిరతము భేద మెంచెదరు • నీమహిమంబును జూడక జ్ఞతన్
ధరణిని నట్టివారు యమ • దండన కర్హులుగారె? కేశవా! 71

ఉ॥ కొందఱు సాంఖ్య యోగమునఁ • గొందఱు శైవ విధంబు నొందుచున్
గొందఱు దేవ నాయకుని • గొందఱు బ్రహ్మను గొల్చుచుందురా
పొందుగ వాహినుల్ కడఁగిఁ • పూర్ణ సముద్రుని జేరుభంగి నీ
సుందర పాద యుగ్మములు • చూడఁగఁ జేరరె వారు కేశవా! 72

చం॥ కరములరార ధాత్రి ఘన • కాంతి వహించిన రత్నసంచయం
బరయఁగఁ గాంచనంబులను • నత్యధికంబగు కాంతి నొప్పి బల్
సరవిని బెక్కుభంగులను • జక్కఁగ సమ్మ్రము వో వృభాతి భూ
నరులను జీవుఁడున్ గలసి • నాణెముగ బ్రభ నొప్పెఁ గేశవా 73

ఉ॥ భానుని రాక చేత రహిఁ • బాతిహిమాంబువు లింకునట్లుగా
మానుగ నీపదాబ్జములు • మస్తకమందు ధరించి నంత నా
స్థానమునందు దుష్టగుణ • సంచయ ముండుట కెట్టులొప్పునోఁ
గాన! మహాత్మ నీవు ననుఁ • గాసిలఁ బెట్టక యేలు కేశవా! 74

మ॥ తనరన్ భూమిఁ ద్రివర్ణమా ప్రణవమున్ • ధాత్రాదిక శ్రేయమై

మునిలోకస్థితి నుద్ధరించి జగతిన్ • ముఖ్యప్రభాతత్వమై
ఘనమై పూర్ణవికాసమై చెలఁగుసీ • గాంభీర్యధామంబు త
ధ్వనిసూత్రాత్మకృతిఁ గప్పాచు న్నిను హృదిన్ • ధ్యానించె
దన్ గేశవా! ॥75

మ॥ ఇలఘంటాసురుఁ డాత్తగర్వమునఁ దా • నేకాలమున్ శ్రీహరిన్
బలుకన్నే వినసంచుఁ గర్ణములకున్ • బల్ప్రోఁతలౌగంటలే
యలుకం గట్టియుఁ బల్మఱున్ హరిహరీ • యంచాడనాలించి యో
చలముం జూపక నామమాత్రమున మో • క్షంబీయవే కేశవా! 76

మ॥ క్షితినుత్పత్తియుఁ బోషణంబులయముం • జేయంగ సామర్థ్యసం
యుతులంబై వరజస్సుసత్త్వముఁ దమం • బారూఢిగాఁ దాల్చి స
మ్మతి బాలింపధరాస్థలి న్వలయుఁ బ్రే • మన్మాధవాభిఖ్యచే
స్తుతిసేయన్ బరతేజమొప్పిమిగులన్ • సొంపొందవే కేశవా! 77

చం॥ పరగనుపాధితోడ ధరఁ • బాదుగఁ గూడుచు జీవుఁడే య్యెడన్
మఱిమఱిఁ గష్టభోగములు • మాటికిఁబొందుచు నెంతొ క్రమ్మఱన్
వరుసగఁ బుట్టుచున్ భువిని • వావిరిఁ జచ్చుచుఁ బాపులుం దునీ
దరిఁ బరుసంబునొందుపద • దాపునఁ జేరరదేమొ కేశవా! 78

మ॥ ఘటముల్ జేసిన పూర్వసంచితములచేఁ • గాయంబునుత్పాదమై
ఘటముంగానదు జీవుఁడిందులకు వా • దానార్హుఁడై యుండి య
న్నిటిఁ వాసంటక దివ్యరూపములచే • నిర్ద్వంద్వుఁడై వెల్గెడున్
బలుదోషంబులు జీవుఁడొందఁడు ఘట • ప్రాప్తంబులోఁ గేశవా! 79

ఉ॥ పాయక చిత్త మెప్పుడును • బర్వెడు నశ్వమురీతిఁ బాఱఁగా
హాయిని నీశరీరమును • నావలస్యందన మార్గ మెవ్వ దే
వేయననేల జీవుఁడును • వేఱయి యాత్మనకర్తలౌసముల్
మాయనుగూడుకర్మమటు• మానుగ సారథియయ్యెఁ గేశవా! 80

మ॥ జపముల్ హోమము యజ్ఞదాన తపముల్ • స్వాధ్యాయముల్ సల్పుటల్
విపులంబౌమఱిస్నానసంధ్యవిధులున్• వేమాఱు దేవార్చనం
బపరోక్షంబగునాత్మయజ్ఞమును • న్నావైశ్వదేవంబులున్
గృపవనభ్యాగతపూజ సత్క్రియలగున్ • గీర్తింపఁగాఁ గేశవా! 81

ఉ॥ తాపసవేషమూని ఘన • దండకకానన మధ్యమందు నా
తాపసులందుసంచరిలి • తన్మయతన్ విహరించుచున్న మీ
రూపుఁగనంగలేక మధు • రోక్తులభూమిజఁగోరుచున్న యా
తాపసకాంతలంబిలిచి•ధాత్రిజచూపెనుమిమ్ముఁ గేశవా! 82

మ॥ మధువున్ మాంసము భక్షణంబుగలయా • మాతంగి యత్నంబుతో

నధికంబై నకపాలమొదుకరమం • బాగూఢిగందాల్చియా
పృథివింగల్లును జల్లుచుండ నకటా • వేటెద్దీ కార్యంబులో
ప్రథితుండారవికోరమాలదనియెన్ • భద్రంబుగాఁ గేశవా! 83

చం॥ అరయఁగ గోవుగ్రాస మొక • డావల గ్రామముగాల్చు రెండునుఁ
మఱియును వృత్తిభేదనము • మానుగ మూఁడునుఁదల్లిఁ జంపుటల్
పరిగఁగ నాల్గుకన్నియను • బాపువిక్రయమైదు వేదమే
యొరులకువిక్రయించుటయు • నొప్పనిదైనది యాఱువానికై
కనుమఱరంగఁజల్లితిని • గాంచఁగఁగర్మకుఁగాను కేశవా! 84

చం॥ ఉదయము భారతంబు మఱి • నొప్పఁగ రెండవయామమందునన్
బదపడి రావణారి కథ • ప్రౌఢిగ రాతిరి కృష్ణు సత్కథన్
విదితముతోడ నెల్లరిల • వేడ్కవచింపుచుఁగాలమంతయున్
యదుకులరత్నసంస్తుతిగ • నారయనుంచిన మేలు కేశవా! 85

చం॥ కడువడినాఱుసార్లు ఘన • కార్శ్యపిచుట్టుఁబ్రదక్షిణంబులున్
బుడమిని గాశియాత్రయును • భూరిగఁజల్పియుసాగరంబులో
నెడపక స్నానముంజలుప • నిన్నియుఁ దూఁగవుచెల్లికందగన్
దొడరి యొనర్చువందనము • తో యదుకుంజర! కాంచఁ గేశవా! 86

మ॥ కనులన్ మూసియునైనఁ గాని మఱియున్ • గన్నుల్ గడున్విచ్చియై
వనుగానిన్ ఘన నాసికాగ్రము వయిన్ • నాణెంపు భ్రూమధ్యమఁ

దును వేదకుండనదృష్టినిల్పినరిగాఁ ♦ దోడ్తోడ నూర్ధ్వస్థలిన్
దనరన్ జూచిన ముద్ర ఖేచరియగున్ ♦ ధ్యానంబులోఁ
గేశవా! 87

మ॥ విలసిల్లంగడు నేత్రయుగ్మమెపుడున్ ♦ వేఱొంటుకున్ ద్రిప్పకే
చెలువొందన్ ఘన నాసికాగ్రతలమున్ ♦ సిద్ధంబుగాఁ
గాంచఁగా
నలమేల్గోచరమై తనర్చునది యే ♦ యాబ్రహ్మలున్
గాంచనోఁ
దిలకింపంబడునద్ది భూచరియనం ♦ దెల్లంబుగాఁ గేశవా! 88

ఉ॥ ఆవలనేత్ర యుగ్మమొక ♦ యర్ధము మూసియు సంతతి
మీఱఁగ నా
స్థావరమైన నాసికము ♦ చక్కటిభాగముమధ్య దృష్టియుం
బావన మొప్పనిల్పుచును ♦ భాసురఫాలముచాలఁ గాంచినన్
దేవరమధ్య లక్ష్యమటు ♦ ధీరత నొప్పనుగాదె కేశవా! 89

ఉ॥ వీనులు లోచనంబులును ♦ వేమఱునాసికయుగ్మముందగన్
మానుగమూసిచాలగను ♦ మక్కువఁ గన్నుల మధ్యమంబునన్
బూనియు దృష్టినిల్పినను ♦ భూరిగఁ జిత్కళనాదబిందువుల్
స్థానము నన్వసింపనది ♦ షణ్ముఖియుందురుగాదె కేశవా! 90

మ॥ నికరంబొప్పఁగ బాహ్యమంతరము లే ♦ నీటొందలక్ష్యంబుతో
నకలంకస్థితినుంచి నిశ్చలముతో ♦ నామీఁదసద్దృష్టియున్
బ్రకటంబౌ నటునిల్పిభూరిపవనున్ ♦ భ్రాంతిన్ వికారస్థితుల్
సుకరంబౌనన నొప్పె శాంభవియనన్ ♦ సొంపొందఁగాఁ
గేశవా! 19

మ॥ నర వింగర్తయొనర్చు కార్యములకున్ • సత్యానుకుంశింపుగాఁ
బరమార్థంబనిపల్కుచుండు మిగులన్ • భావింపఁ బేరేవకుం
డరయన్ మంచిదటంచుఁ జెప్పునుగదా • యామోదకుం డెన్నఁగా
పరలేకుండఁగ నల్వురున్ సముతె పు • ణ్యంబొందుచోఁ గేశవా! 92

ఉ॥ దాతను వేఁడ నర్థికడు • దానగుణంబట లేకయున్నచో
నాతఁడు లేదులేదనిన • నారయబుద్ధియు నర్థిఁ జేరదే
ఖ్యాతిగ నర్థికచ్చుటకుఁ • గల్గినదాతను జూచినంతనే
చేతము దాతవీడి యొరుఁ • జెందదు నిక్కముసుమ్ము కేశవా! 93

మ॥ శ్రుతిసీరాన్నముకన్న రెండవదిలం • జెప్పంగ లేదెయ్యెడన్
వెతుకన్ ద్వాదశికన్న గొప్పవ్రతమున్ • వేమారు లేదేకదా!
అతిగాయత్రికిఁ బోలుమంత్రమిలపై • నారాధ్య లేదేవినన్
మతినూహింపఁగఁ దల్లిమించుసురలు • న్నారే ధరం గేశవా! 94

చ॥ అగణిత మీసునామరుచి • నారయశంభుఁ డెఱుంగు మిన్నయా
మగటిమిమీపరాక్రమము • మర్కువశంభుధను స్సెఱుంగునో
ఖగపతివాహా! నీశరశి • ఖన్ ఘనసాగర రాజెఱుంగునీ
జగతిని నీపదాబ్జరుచి • చాలనహల్యయెఱుంగుఁ గేశవా! 95

మ॥ యతులున్ సంధులునున్ సమాసములు న • త్యారూఢిఁ దత్ప్రాసలు
న్నతమానట్లుగ నర్థగుప్తచయముల్ • నానేర్పుభాతిందగన్

శతకంబిట్లు రచించినాఁడమతిసీ • సత్త్వముచే దీనిలో
నతిలోపంబులు గల్గినం గృపను నీ • వాలింపవే కేశవా! 96

ఉ॥ ఆయువు నూఱువత్సరము • లందులనిద్రను నర్ధమేఁగెడున్
బాయక నిల్చునేఁబదిని • బాల్యము యౌవనమున్ జరాదులం
దాయెడ నిర్వదేనుచను • నర్ధము నెంచఁగ వ్యాధులంజనున్
వేయన నేల జీవునకు • విష్ణునిగొల్చుట మేలు కేశవా! 97

మ॥ చెలఁగన్ ధాత్రియుగాబ్ద సంఘములఁగోఁ • జింతింపఁగా నీయుగం
బలగన్ సర్వయుగాలకంటెమిగులౌ • నాతత్త్వముం జెందఁగాఁ
బలుమాఱాగతికల్పముల్నిబిడమై ప్రాప్తించితూలింపఁగాఁ
దలపంగాఁ గలికాలమిష్ట సుఖముం • దన్మోక్షమాఁ
గేశవా! 98

మ॥ ధరనష్టాక్షరి మంత్రమందిమిడియే • ధన్యంబుగానుండె "రా"
నరపంచాక్షరి మంత్రమందిమిడియే • వర్ణింప "మా" యుండెనా
గరిమన్ రెండును గూర్చి పల్కనదియే • కన్గొంటె "రామా" యగున్
ధరలోఁ దారకమంత్రమద్ధితలఁపన్ • దథ్యంబుగాఁ
గేశవా! 99

మ॥ ఉపరాగంబున నాలవిప్రులకుఁదా • నుత్సాహియైయిచ్చినన్
విపులంబొప్పగయాప్రయాగములలో • వేవేగ సేవించినన్
గృపతో మేరు సమానరుక్మమిడినన్ • గీర్తింపనీధ్యానమం
దుపమింపంబడ దేదియైన భువిలో • నూహింపఁగాఁ
గేశవా! 100

చం॥ గ్రహములఁగొల్తుభానుఁడరుని • గావ్యునిజంద్రుని జంద్రసూనునిన్
రహిఁగనమందుదేవగురు • రంజిలుభూమిసుతోత్తమోత్తముల్
బహుతరభక్తిఁ గేతువును • భవ్యతరంబుగ రాహువున్ దగన్
సహజముతోడఁ గొల్చెదను • సద్గ్రహకూటమి నెంతొ కేశవా! 101

శ్రీమత్ గోపాల కృష్ణ పరబ్రహ్మణే నమః



# శ్రీ కేశవశతకము.

## ద్వితీయ భాగము.



శా॥ ఎంతో దూరమునందు నుండు దివమం ♦ దీ భూమిలో మానవుల్
చింతంజెందుచుఁ బోవఁ జాలమనుచున్ ♦ జీకాకుచేఁ దూలి తా
మంతర్భావమునందు నిన్నుఁ గనకే ♦ హా యిట్టులా చుందురే
కుంతీనందను లట్లు పిల్చినను గో ♦ రుల్గూర్పవే కేశవా! 1

శా॥ రావేయంచని సామజంబు నుడువన్ ♦ రమ్యంబుగాఁ గాంచియే
త్రోవంజూడక భక్తరక్షకుఁడవై ♦ తోడ్తోడ రక్షించి తా
నేవేళన్ బహు దూరభారమనకే ♦ వెన్నంటి భక్తాళికిన్
బ్రావీణ్యంబుగ స్నేహబంధువు స్థితిం ♦ బ్రాపైతివో కేశవా! 2

మ॥ యుగముల్ నాల్గగు వానిలోన మిగులై ♦ యొప్పైనదా కల్యుగం
బగు సందర్భ విధి సూత్రభాష్యములతో ♦ నవ్వేద పారంబులం

జగతింజల్పుచుఁ దత్త్వమార్గులగుచుర్ • సంసారనిర్ముక్తులై
సుగతింజెందరె నీదురక్తివలనన్ • సుస్థాయిగన్ గేశవా! 3

మ॥ గరిమన్ గాశి పురంబునందు వశిగన్ • గాన్పించు చండాలుఁడా
ధరనాదిన్ ఘనశంకరార్యకడకున్ • నా వేడ్కతో నేఁగినన్
మఱినాసద్ఘనశంకరుండు శ్వపచుం • భావించి తా వానితో
సరయన్ దగ్గఱడాయనీకుఁజనునే • యట్లుండనే గేశవా! 4

మ॥ వినరింపంబడెఁగాదె యున్న మయమున్నా • విశ్వంబులోఁ బ్రాణుల
య్యావిష్టల్లుండెఁగ నంతరాత్మయొకఁడే • యైయుండుటన్ గానవే
భువినీదా ఘనప్రత్యగాత్మకుఁ బరన్ • బోలంగనాయాత్మకీ
యవనిన్ భేదము లేకయుండెనుగదా! • యధ్యాత్మ శ్రీ కేశవా! 5

మ॥ తలఁపన్ వారిననదీప్రవాహముల సం • దర్శింపఁజండాలు వా
కిలికిన్ జేరువనుండు వాపిజల సం • కీర్ణంబులై యుండుఁ గే
వల మామ్రృత్తిక హేమకుంభ జలధిన్ • వర్ణింప దివ్యప్రభా
కళలన్ భాస్కరబింబమొక్కపగిదిన్ • గాన్పింపదే కేశవా! 6

మ॥ కనుకన్నీరలు నేనుడాయుపనియే • కాదంచు భాషించినా
రననుంబుంగడు జ్ఞానచిత్తుఁడగుచో • నన్యాన్వయుండైన స
ద్వినయుండంచని విప్రుఁడంచని శ్రుతుల్ • వేవల్కవే జ్ఞానమున్
గనువిప్రశ్వపచుల్ సమానులను వా • క్యంబెన్నరే కేశవా!7

ఉ॥ భారతివీణెమీట బహు • భంగులవిష్ణువుశంఖమూఁద నా
మారునిసోగరుండు పలు • మార్పులఁ దాళము వేయుచుండ నా
నూరమృగాంకులిద్దఱును • సొంపుగఁగాహళవాద్యభేదముల్
భోరున మ్రోత జిష్ణుఁడును • భూరిమృదంగము తట్టఁగిన్నరీ
వారిజలోచనల్గదిసి • వాక్చతురత్వము లొప్పగానముల్
తీరుగఁ బాడఁ దాండవము • దీటుగనాడెమృడుండు కేశవా! 8

చం॥ ఘనమగు కాశియే తనువు • కన్నుజాహ్నవిజ్ఞానగంగయౌ
మనమున నెన్నశుద్ధగయ • మాన్యతనొందుగురుండు చూడఁగా
ననయమె మోక్షం దలంచుటయె • యారసిచూడఁ బ్రయాగ యాఁగనన్
విసఁగఁ దురీయమే శివుఁడు • వేఱొకతీర్థము లేల కేశవా! 9

చ॥ అరయఁగ సత్యమే జనని • యాపయిజ్ఞానము తండ్రి యాఁగనన్
సరసపు ధర్మమగ్రజుఁడు • చాలుగసద్దయయే హితుండగున్
మఱి కనశాంతియే సతియు • మక్కువనోర్పు కుమారుఁ డాధరన్
సరగను బల్కె ధర్మజుఁడు • చక్కఁగ బంధువులౌఁ గేశవా! 10

చం॥ తనకునుమానహానియటు • దాపునఁగల్గినప్రాణసంఘముల్
తనువునఁబోవఁగా విడిచి • తాల్మినిమానముఁగాచుకోఁ దగున్

ఘనముగు బ్రాణముల్ స్థిరము • గావని యెంచుచు మానమె స్థిరం
బనుచును దెల్పె భీముఁడటు • లావనిలోఁ బలనాఁడు కేశవా! 11

ఉ॥ భోజనమందు విప్రులకు • భూరిగఁ గోర్కెలు గల్గునట్లుగా
నీజగమందు ధేనుతతి • యింపుగఁ బచ్చికఁ గోరుమాడ్కిగా
రాజిత మొప్పఁగా విభుని • రాకను గోరెడు స్త్రీలభంగిఁగా
నాజిజయంబు సందెకడ • నాశయనెవ్వఁడయుండు కేశవా! 12

ఉ॥ మేదిని సన్యభామలను • మిక్కిలి తల్లులటంచునెన్నుటల్
పాదుగ నొడ్లద్రవ్యములు • బాగుగఁ బెంకులుగాఁ దలంచుటల్
ఆదరి మొప్పభూతముల • నన్నిటినిం దనయాత్మభాతిగన్
మోదముతోడఁ గాంచుటయు • ముఖ్యమనెన్ నకులుండు కేశవా! 13

ఉ॥ దేహమనిత్యమైనను గడు • దీనతనర్థము నష్టమైనను నా
నాహసమృత్యుదేవతయె • సన్నిధఁ బాయకయుండు సంచునా
యూహఁ జరించి ధర్మమున • నొప్పఁగఁ జేసినఁ గీర్తియుంచునం
దేహము లేకవల్కె నహ • దేవుఁడు యుద్ధమునందుఁ గేశవా! 14

ఉ॥ సుందరమూర్తియై భువిని • శోభిలునట్టి కుమారునైనను
బొందుగఁ దండ్రినైనఁ దగ • భూవలయంబున భ్రాతనైనను
సందియముంచకేమిటను • జాలఁగ నొంటరి పాటు కల్గినన్
నిందకునైన నోర్చఁబడుచు • నీరజనేత్ర వరించుఁ గేశవా! 15

చం॥ కఱవున నన్నదానమును • కాలమునందున నర్ధదానమున్
నవని యుద్ధమందునను • సాహసధైర్యములొందియుండుటల్
పరగను సొమ్ముబాకియును • బల్మఱుఁ జేయకయుండు వారికిన్
బరువసి మ్రొక్కులీయవొకొ • భాసురమొప్పఁగ నీవు కేశవా! 16

ఉ॥ భాసిలు మేడిపూవులను • బల్మఱుఁ గాంచఁగవచ్చు మేదినిన్
గాసిని జెంది తెల్లనగు • కాకులనైనను గాంచఁగాఁదగున్
వీసరఁ బోకమత్స్యములు • వెళ్ళినజాడను బట్టవచ్చునో
కోసలనాధ స్త్రీలయెడ • గూఢములన్నన లేము కేశవా! 17

చ॥ అవనిని వాను గూర్చుకడు • నర్ధవిశేషము నగ్రజాతికిన్
బ్రవిమల యౌవనంబు దన • భామినియందును జేర్చిభక్తితో
నవిరళచిత్తమెవ్వఁడును • నాగయునీయెడఁ జేర్చియుంచు లే
యివియుబ్రవతాఖ్య లంచనడె • యింపుగఁ గణ్ణుఁడు నాఁడు కేశవా! 18

చం॥ ఇలఁగనజాయ పోవుటయు • నిమ్ముగసజ్జనపంక్తిదూఱుటల్
పలుమఱు నప్పు నిల్పుటయుఁ • బాల్పడి హీనుని గొల్వఁ జేయుటల్
చెలఁగి మహాదరిద్రమును • జెందఁగఁ జుట్టలు చేరి నిల్చుటల్
కలిగిన నిట్టి కష్టములు • గాదని దాఁటఁగలారె? కేశవా! 19

చం॥ శకునము చూచి యేఁగుమని • చక్కఁగఁ దెల్పు గురుండు ధాత్రిపై
నికరముగానుపస్సునన • నేటకుఁ బొమ్మని గర్గుఁడాడఁడే

ప్రకటమనోజ వంతనను ♦ భావముఁ బల్కుఁడె మాని యొక్కరుం
డొకటద్విజోక్తి నిక్కమని ♦ యొప్పుగఁ బల్కవె నీవు కేశవా! 20

మ॥ ధరఁ బెంపొందున మూఁడు పిల్లలఁ గనన్ ♦ దర్కింప సింహాంబులం
దరయన్ వ్యాఘ్రము పిల్లలై దుగని తా ♦ మన్యాయతన్ శూన్యమా
స్థిరతన్ ధేనువు లొక్కదానిఁ గనియుం ♦ జెన్నొందు సంఘంబులై
విరళంబౌఁగద! ధర్మమెల్లడల నో ♦ విశ్వేశ్వరా! కేశవా! 21

ఉ॥ గీతము సల్పు కాలమునఁ ♦ గేవల నాట్యము సల్పు వేళలం
దాశతమైన వాద్యమును ♦ నంటముగా జరిగించు వేళలన్
ఖ్యాతిగ శత్రువర్గములఁ ♦ గ్రన్ననద్రుంచు ప్రచండ వేళలం
బ్రీతిభుజించునట్టి యెడ ♦ బ్రీడఁద్యజించుట మేలు కేశవా! 22

శా॥ దైవాధీనము లోకమెల్లఁ గనఁగాఁ ♦ దద్వేదమంత్రంబులో
దైవంబొప్పెఁ గదున్ విచిత్రముగనన్ ♦ దన్మంత్రముల్విప్రస
ద్భావాధీనములై చెలంగెఁ గనుకన్ ♦ భద్రస్థితిన్ క్షోణిపై
దేవా! భూసురుఁడన్న దైవమనరే ♦ దేవేశ్వరా! కేశవా! 23

చం॥ నిలిచి మహానదుల్ దలఁప ♦ నీరము లెప్పుడుఁ ద్రావనట్లుగాఁ
దలఁపఁగ భూజరాజములు ♦ తత్ఫలముల్ భుజియింపనట్లుగాఁ
బలుమఱు మేఘుఁడెన్నఁడును ♦ బంటఫలంబును నొందనట్లుగా
నిలఁ గన మర్త్యులెల్లపుడు ♦ నిట్లుపకార మొనర్తు కేశవా! 24

మ॥ శివునే కానియునిన్నుఁ గానిమిగులన్ • సేవించుటే భావ్యమం
చవనిన్ గాంచఁగనేక మార్గులనుచున్ • జర్చించునవ్వేదమం
దవలోకించక భేదభావములతో • నర్థంబుఁ జూపించు వా
రవనిన్ గాలునిదాపుఁ జేరుదురహో • యత్యంధులై కేశవా!

చం॥ అరయఁగనవ్వుఁ జేయుటయు • యాచన ముప్పునుఁ బొంది యుండుటల్
మఱియును జారలక్షణము • మానక పొంగ నసంబాసర్చ్చటల్
తిరమగు బీదయాటయును • దీపవువ్యాధియు భుక్తశేషముల్
విరివిగఁ దింటయున్నిదియు • పీడనికష్టములంద్రు కేశవా! 26

ఉ॥ తామసవృత్తియే యముఁడు • పెద్దయువైతరణీ సకాంక్షయున్
ధీమతిఁ గాంచనెయ్యమును • దీటగు విద్యయె కామధేనువౌఁ
బ్రేమఁ జెలంగు హాసమును • బెంపొదవన్ వనమౌను నెంచఁగా
నోమహనీయ! నీకు సరి • యొప్పునె యెన్నియునైనఁ గేశవా! 27

ఉ॥ రోగికి శీలవంతులకు • రూఢిగ వృద్ధులకర్భకాళికిం
బాగుగఁ జూడ వీరలకు • మంచి వ్రతంబులు సల్ప నేటికిన్
రాగవిదూర! నీమహిమ • రక్తియు చాలదెయట్టివారికిన్
భోగము తేలయి యాథరవి • భూతియె మోక్షము నిచ్చుఁ గేశవా!

మ॥ పరవిన్ భోగియు రత్నరాశివలనన్ • సద్భావితుండయ్యుఁ దాఁ
బరగన్ ధాత్రిభయంబు నొందునటులం • భావింపదుష్టాత్ముఁడున్
గరిమన్విద్యలలంకరించినను దాఁ • గాలంబుగనట్టియే
స్థిరతన్ దూరము నేఁగుచుంటఘనమా • చిద్రూప శ్రీకేశవా!

చం॥ పుడమిని శూద్రులెల్లరును ♦ భూసురకాంతలతోడఁ గూడినన్
వడిగను కృష్ణధేనువున ♦ వచ్చిన క్షీరము లారగించి తా
మడలక వేదమంత్రముల ♦ నన్నిటినోపిక నభ్యసించినన్
జెడుమతులై యతంగులుగఁ ♦ జెప్పఁబుట్టరె ధాత్రిఁ గేశవా! 30

ఉ॥ ప్రాకటమొప్ప నీభువిని ♦ భాగ్యముగల్గిన వారిఁ గాంతలన్
జేకొని పుత్రులన్మిగులఁ ♦ జేరి నుతింతురు పెద్దసేయుచున్
జోకను బంధుమిత్రులుగఁ ♦ జూచెదరింపుగ సొంపుమీరఁగా
నాకరణిన్ సుధీజనుల ♦ నారయఁ జూడరదేమొ కేశవా! 31

మ॥ పరికింపన్ భువిఁ దల్లిలేని శిశువుం ♦ బాలింప వీలానాకో
యరయన్ నాథుఁడు లేని స్త్రీల జననం ♦ బాధాధిగా వ్యర్థమా
గరిమన్ శాంతము లేని భక్తిసలుపన్ ♦ గల్గించునే మోక్షమున్
బరగన్ జోష్యము లేని భోజనములున్ ♦ బాగొప్పునే కేశవా! 32

చం॥ మిగులఁ బటంబులందమున ♦ మేలగుచుండు జనాళికెంతయో
తగఁగను మంచిభోజనము ♦ తద్దయుఁ జల్పినఁ దృప్తిఁ గాంతురా
జగతిని గాంచ ముఖ్యమగు ♦ చారుగుణంబులు స్త్రీలకెన్నఁగా
నగణిత విద్య శ్రేయమగు ♦ నారయ విప్రులకెల్లఁ గేశవా! 33

ఉ॥ వేదము నేర్చినందులకు ♦ వేడ్కవహించితాశను వ్రేల్చుటొప్పగున్

బాదుగఁ ద్రవ్యమున్న యెడ • బాగుగదానముఁ జేయ మేలగున్
మేదిని నాతియున్న యెడ• మేటికుమారులఁ గాంచ బాగగున్
మోదముతోడ శాస్త్రముల • మోఘముగా వినశుద్ధి కేశవా! 34

మ॥ దవులన్ మానవకోటికిల్బిషములున్ • ధాత్రీవిభుల్ జెందుదు
ర్భవులారాజు లొనర్చు పాపచయమా • పౌరోహితుం జెందుఁగా
వివరంబొప్పఁగఁ గొంతదోషములుభా • వింపంగఁ దద్భర్తకా
నవురాశిష్యులు సేయు గొప్ప యఘమా • యాచార్యుకౌఁ గేశవా! 35

మ॥ మానుగయాచ కాళికదు - మక్కువఁ జెందిన పిన్నవారలున్
బూనినటించు దారలును - బొందుగ రాజులు నెన్న నల్లురున్
గానరుపీరలై దుగురుఁ - గల్మియు లేమియు నించుకంతయున్
మానివిలోల నీస్తుతిక్ర - మాపథముందిన రేమి కేశవా! 36

మ॥ కొఱగాకుండిన యట్టి దేశచయమున్ - గ్రూరాత్ముఁడౌ మంత్రునిన్
గొఱగాకుండిన రాజ్యభారముఁదగన్ - గూర్రాత్ముఁడౌ చుట్టమున్

గొఱగాకుండిన చెడ్డభార్యనుమతిన్ - ఘోరంపుఁగార్యాకరున్
ద్వరగస్వీడుట మంచిదాను నిలలో - దైత్యాంతకా! కేశవా! 37

మ॥ వివరింపంగను నిచ్ఛలేని యెడలన్ వేదంబులున్ వ్యర్థమా
భువిజీర్ణంపని భుక్తినల్పిన యెడం - బోవు న్విషజ్వాలయై
యవలోకింప దరిద్రమానవులకున్ - హాగోష్ఠియే కాళియా
నవనిన్ వృద్ధుని కెన్నఁగాఁ దరుణియే - యానాభియాఁ గేశవా! 38

చం॥ కడువడి మోదమార్గమును - గాంచఁగ మిక్కిలి సాహసంబునున్
బుడమిని ధైర్యలక్షణము - భూరిస్వశక్తియు శూరధర్మముల్
విడువని మంచిబుద్ధియును - వృద్ధియునియ్యవి యాఱు మార్గముల్
తడయక నల్పువారలకుఁ - దత్వము నిత్తువుగాదె కేశవా! 39

చం॥ సకలగుణాఢ్యుఁడైన నొక - సద్గుణ శాలిసుతుండు చాలఁడే
వికలమనస్కులైన నొక - వేగురుపుత్రులు గల్గనేటికిం
బ్రకటముగా నిశాపతిన - భంబున వెల్గకయున్న నత్తఱిన్
సుకరములేని తారలను - జూడఁ బ్రకాశమె ధాత్రిఁ గేశవా! 40

చం॥ బరువడి నాత్మజాతులకుఁ - బాయని యప్పిడుతండ్రి
మతిమతిజారమైతిరుగు - మాతయొపుత్రునికెన్న శత్రువౌఁ
బరగఁగసుందరాంగి తన - భర్తకు నెక్కుడు శత్రువౌఁ
గనన్
మతిఘనవిద్య నేరని కు - మారుఁడె తండ్రికి వైరి
కేశవా! 41

చం॥ ఉడుగణనాధుఁడైన విధుఁ - డొప్పగ రాత్రిఁ బ్రకాశ
మొందఁడే
కడువడిలోకబాంధవుఁడు-గన్పడుచుండఁడె కాంతిహెచ్చుగాఁ
బుడమినిధర్మదేవతయు - భూరిప్రభావముతోడ నొప్పదే
వడిగసుపుత్రకుండుకుల-వార్ధిని బ్బఁగఁజేయుఁ గేశవా!42

ఉ॥ దాతదరిద్రుఁడౌనని లఁ- దద్దయునాకృపణుండుభాగ్యుఁడౌ
పాతకికాయువెక్కువగుఁ- బావనుఁడల్పవయస్కుఁడయ్యెడున్
హేతువదేమొకో కలవి - హీనుఁడు రాజయితేజరిల్లఁగా
నాతసనుత్తమాన్వయుల- నాశ్రనిసేవలొనర్చు కేశవా!43

ఉ॥ చాలధనంబుగూర్చిధర - సాధులకీయకకూలుఁ గాని తాఁ
గూలినయంత నేధనము-కొంచెమువెంటనురాదు కానినా
లీలనబంధుమిత్రులవ-లీలఁగఁ గాటికిఁ జేర్చిపోదురా
పోలఁగవచ్చునాయశము-పూర్వభవంబునఁ జేయుసంస్తుతిన్
మేలొతలంపఁగీడొయిల-మీఁదనిఁ గేదనిఁ సమ్మఁ గేశవా!44

చం॥ పరగదరిద్రకోటికిని - బాగుగదానమునిచ్చుటొక్కటొ
సరిగనుబూజలేనిగుడిఁ - జక్కఁగఁజేయుట రెండుధాత్రిపై

బరువశిదిక్కులేనిశవ - పంక్తినిగాల్చుటమూఁడుకాపునన్
నరునగ నల్పునీవిధులు - వాస్తవయజ్ఞఫలంబు కేశవా! 45

ఉ॥ లోకమునందుఁగాంచఁగను-లోలతగర్భిణిబిడ్డఁగాంచుచోఁ
జేకొని గొడ్డురాలెటులఁ - జేసియు వేదన తానెఱుంగదో
ప్రాకటమైనవిద్యఁగల-ప్రాజ్ఞులమార్గముమూఢమానవుల్
జోకనుగాంచఁజాలరటు-చూడఁగధాత్రినినెన్నఁ గేశవా!46

మ॥ భువిలో నధ్యయనాది హీనునికిడం - బొల్పొందునే దానముల్
వివరంబొప్పఁగ భర్త లేనిదశముల్ - వేనిల్చునే యాజిలో
సువిశేషంబగునొక్కొ సుందరమునుం - జూడంగగోత్రాలికిన్
దివ్రౌనక్షిణలేనియజ్ఞచయముల్ - దీపించునే కేశవా! 47

చం॥ నిరతము చింతయేజ్వరము - నిక్కము మానవ కోటికెంతయున్
బరఁగఁగసంబరంబులకుఁ - బల్మఱునుష్ణతయేజ్వరంబగున్
దిరముగఁ జంచలాత్ములకు - దివ్యవిభూషలు లేనిదేజ్వరం
బిరవుగ నశ్వకోటులకు - నెన్నజ్వరంబు రమింపు కేశవా! 48

ఉ॥ సారసలోచనా! యిటుల - సన్నుతిఁ జేసియు నిన్నుఁ జక్కఁగా
మీఱిననీతిశాస్త్రమున - మేలగుశ్లోకము లేరి నేర్పుమైఁ
గూరిమి పద్యధాటిగను - గూర్చిరచించితి నేఁడు నీకృపన్
ధారుణిఁజిత్తగించినను - ధన్యునిజేయవెల్తుఁ గేశవా!49

శా॥ చైతన్యుండగునిన్నుఁగాంచఁబడునా - జీవాత్మలున్ నీవునై
ధాత్రిన్ మించిన యిర్వదైదయినయా - తత్వంబులున్ నీవునై

ఏతత్త్వార్థముఁ దెల్పు నెల్లరకు న-ట్లే వేదముల్ నీవునై
భూతాంతర్గత భావుఁడంచు ధరణిన్ - బాల్పొందితో
కేశవా! 50

మ॥ మనముల్ బుద్ధి నిజంబుఁ గూర్చి పిదపం-బల్మాయు షడ్వర్గముల్
తెనుకందీయ శకూలఁ జేసి మిగులన్ - వేయింద్రియాలన్ ధరన్
దనరన్ ద్రెళ్లఁగఁ జేసినన్ ద్రిగుణముల్ - దాదవ్వులన్ గూలనీ
ఘనచిద్రూపము గల్గనౌనుగ నఁగన్ - గంభీరతన్ గేశవా! 51

శా॥ జీవుండున్మతి యీశ్వరుండు నొకఁడై - చెల్వొందఁగాఁ
గూడ కే
భావింపన్ బరమాత్మ వేఱెయగుటన్ - బంధంబులౌ జీవికిన్
జీవుండున్మతియీశ్వరుండుఁ గలియం - జేకొంటి చైతన్యముల్
దేవా! నీదగు మాయగాదె యిటులం - దీపించుటల్ కేశవా! 52

మ॥ చెలువొందన్ భువిభూతపంచకములుం - జెన్నైన జ్ఞా
నేంద్రియం
బులు నైదు న్మతిభూతజాలము పకున్ - బోలంగఁ గర్మేం
ద్రియా
లలరారంగను నైదు చూడ ధరలో - నా మీఁదఁ జర్చింపఁగాఁ
గలయావద్విషయాదిపంచకము ని - క్కంబెన్నఁ జాతు
ర్యముల్
దలఁపన్ నీవును గూడ నిర్వదియుదా-దత్త్వంబులో కేశవా! 53

మ॥ మనముల్ బుద్ధియుఁ జిత్తమొప్పి సరిగం - బాగా నహం
కారముల్
దనరన్ దోడుగఁ బ్రాణవాయువులునున్ - దథ్యంబు
జ్ఞానేంద్రియా

లును కర్మేంద్రియ పంచకంబు ధర నా • లోచింపఁ బం
డొమ్మిదా
వనమాలీ! యివిలింగదేహమగునా • వర్ణింపఁగఁ గేశవా! 54

శా॥ ఈభూమండలిఁ దూర్ణనాభియొకఁడే • యింపారఁగన్ యుక్తిచే
సాభిప్రాయముసంగి తంతుచయమున్ • సాధారణ ప్రజ్ఞచే
శోభిల్లన్ దనమేనినుండి కలుగన్ • జోద్యంబుగా నల్లదే
నీభావంబు గనంగ నట్టిదిగదే • నీలాంగ శ్రీకేశవా! 55

శా॥ నీమాయన్ జగముల్ జనింప మిగులన్ • నీసత్వమే
తాల్చియున్
వేమాఱున్ సృజియింపఁ బెంప నణఁపన్ • వేనికుఁ గర్తృ
త్వమా
కౌమారీస్తుత! చాలసహ్యాతసుధం • గంతంబునం గ్రోలవే
భూమిన్ నీయపరోక్ష జ్ఞానమపుడున్ • బోధ్యంబుగాఁ
గేశవా! 56

ఉ॥ సారెకుఁ బంకమందుఁ బలు • సారులు గ్రుమ్మఱుచున్నఁ
గొంతయున్
జేరువనంటునే బురద • చెల్వగఁ గుమ్మరి పుర్వొకందు నే
నారయఁ జింతపండునకు • నందుల బొబ్బరి యంటనట్లుగా
నీరహినిన్ను నంటనటు • యింద్రియకోటి సురేశ! కేశవా! 57

మ॥ పరగన్నాత్మనవు లెండమావులు మదిన్ • భావించి నీఁటంచువే
సరవిన్ భ్రాంతినిజెందినట్టి స్థితిగా • సర్వేశ! నిన్గానక
ధరణిన్ గేవలగేహవిత్తములతోఁ • దార్కొప్పి యెల్లప్పుడున్
దరిఁజేరన్ విధిగాన రైరియులలోఁ • దర్కింపగాఁ గేశవా! 58

మ॥ చపలుండౌనని నన్నుఁ గావక రమేశా! యిట్లుపేక్షింపఁగా
నువయుక్తంబుగఁ దోఁచెనే మది నొకంటో దేవ! నీ
యంఘ్రులన్
విపులంబౌనటుచేర్చి నిల్పితిని న న్నేవేళఁ గాపాడవా!
అపరాధాన్వితునన్నుఁ గావఁగద వే యజ్ఞాత్మ! శ్రీకేశవా! 59

ఉ॥ అండవునీవటంచు హృదయంబున నమ్మితిఁ బార్థుభాతిగాఁ
గుండలిశాయి నన్నుఁ బర గోష్ఠిని జెందుచునుండనీక నీ
దండపదాబ్జ యుగ్మమును దాటిగఁ జూపియు సద్గుణాబ్ధి! భూ
మండలిఁ బ్రోవవే దయను మానిత లోకవిహార! కేశవా! 60

మ॥ తగునే నన్ను దరిద్రుఁడంచు మదిలో దప్పించి రక్షింపకే
జగతిం జాల ధనంబుగల్గు పరులన్ జక్కంగ రక్షింపవే
తగు నన్నిపుడ నేఁజేయు? నిలలో దాతృత్వముం గల్గినన్
దగ నన్ను న్గొడఁబూనలేక కొలువుం దత్త్వార్థినై కేశవా! 61

ఉ॥ మంచితనంబుచేతఁ బలు మారులు వేఁడినఁ గాని నీవు నా
సంచితకర్మ హేతువున సంభవమైన మదీయ పాపమే
యెంచి యొకింత బ్రేమను వహింపక యోకడ తేర్పవైతి నేఁ
గొంచెపువాఁడ నాయెడలఁ గొంత దయారస మీవె
కేశవా! 62

చం॥ అధిపతివంచు నిన్ను హృదయంబున నమ్మినవారి
బంధముల్
శిథిలముఁ జేసినాఁడవని సిద్ధముగా విని యెంతో వేఁడితిన్
మధురసుభాషణా! విమల మంజువచోరసమూరధీర నీ
కథలను నాకుఁ దెల్పుమటు కర్ణములుం జెవురింపఁ గేశవా! 63

సోహామటంచుఁ బలుకుదురు ♦ శుద్ధమనంబుల నొప్పి
కేశవా! 68

ఉ॥ ప్రాణభయంబుమాని బహు • భంగుల మిమ్ముఁ దలంచు వారికిన్
క్షోణిని నివరోతమముఁ • జూపుదువీవని చెప్ప వేశ్రుతుల్
జాణతనంబునన్ గనుక • జంగమముల్ గడునమ్రవారలన్
బాణులుగట్టి కాలునకుఁ • బట్టియొసంగుదుగాదె కేశవా! 69

ఉ॥ కోకిలజాతి పల్కునటు • క్రొంచెము కాకము పల్కనేర్చునే?
కేకివచించు రీతిగను • గీరముపల్కునె పంజరంబులో
నాకరణిన్ బుధోత్తముల • కారయ స్వల్పులు సాటివత్తురే
యోకమలాక్ష! నీకరుణ ♦ నొప్పగ నాపయినింపు కేశవా! 70

ఉ॥ కూడదనీదు పొందుమదిఁ ♦ గోరియొనర్చెద నీకువిందునే
వేఁడితిఁ జేతునంచు హరి • వేగమె నీదయరాఁగనుందుగన్
జోడిమినాదు సందునను ♦ భూరిగనీహృదయంబు సందునన్
జూడఁగలేదు భేదమెటు ♦ సుంతయినంగమలాక్ష! కేశవా! 71

ఉ॥ ఆడెదనీదు గోష్ఠియును ♦ నద్భుతమొప్పఁగనంతరాత్మలోఁ
బాడెద వాణిమెచ్చబహు ♦ భంగులగీతము వీణమీటుచున్
వాడెదనీదు కీర్తియిల • వైష్ణవుమించగ లేరటంచునే
వీడెదనాత్మబంధువుల • విశ్వమయుండవటంచుఁ గేశవా! 72

ఉ॥ వారిజనాభ! తొల్లితన ♦ వార్ధకమందున నీదునామముం
గోరియజామిళుండుతన • కూరిమిబిడ్డకుఁ బెట్టిచీరఁగా
నేరములెల్లఁ బాపియటు • నేర్పునఁ జేర్చవెనీదుపాదమం
దోరమణీయనామ! మది • నొండు తలంపక కావు కేశవా! 73

ఉ॥ దానవనాథుఁడౌ బలిని • ధార్మికుఁడంచును మెచ్చి వేఁడగా
మానవనాథ! నీకునటు • మానుగ మూఁడుజగంబులీయఁగాఁ
బూనిసురాధినేతకిడి • భూరిగ నేలవె రాక్షసోత్తమున్
వానరరక్ష! యీవసుధ • వైష్ణవునాకృతినిచ్చి కేశవా! 74

ఉ॥ మానధనాఢ్యుఁ డానలుఁడు • మందిరమున్విడనాఁడి కానలో
మానినితోఁ జరించి శ్రమ • మగ్గుచునుండఁగ నంతలో నవీ
మానుషరూపుగన్పడచి • మక్కువ రాజునులక్ష్మిఁ దేల్చవే
దీనజనావకార! నను • దిగ్గునఁ గావవె గొల్తుఁ గేశవా! 75

ఉ॥ అడుగను వేయనీయ నటు • లార్తులరక్షణ చిహ్నముం డియున్
బుడమిని నేలకుంటవటు • పోవనుగాలము తూలిచాలఁగా
వడవడియే మహాత్మ! యిఁక • నాథులికెవ్వరు నాకు లేరు నా
నొడితన మీవాత్సల్యతివి • మోర్చితి నింకను గావు కేశవా! 76

శా॥ ఈలోకంబున జన్మమెత్తుమనిన న్నిక్కట్టులన్ బెట్టుచున్
జాలంబెట్టులఁ జేయ నేమిఫలమో • చక్రంగనీ హేళవీ
వాలోకించియు నన్నుఁ గావఁగదవే • యాఖ్యాటముల్ మావిశ్రీ
లోలా! వంతముఁ బూన నీకుఁదగునా • లోకేశ్వరా! కేశవా! 77

మ॥ గతజన్మంబున నిన్నుఁ గొల్వనుగదా! • కాఁబట్టి యీజన్మమి
ట్లతివేగంబునఁ గల్గనయ్యెనిది నీ • యాజ్ఞే వశంబౌనె నే
మతిలోఁ గానక చేసినందులకిదే • మన్నింపుమన్నాఁడనో
పతితోద్ధారక! పావనాఖ్య! నను వే • పాలింపవే కేశవా! 78

చం॥ అమలినభక్తిసీయొడలఁ నబ్బినవెంటనె దోషజాలముల్
సమయు నెయగ్నిలోఁబడి భృ • శంబుగఁ గాలు తృణంబు రీతిగా
సమముగఁ జూచి నన్నుఁ దమ • శాసనదీప్తులు గాంచఁ జేయ కే
భ్రమరము కీటకంబుస్థితి • భద్రము నీవటు చేయు కేశవా! 79

ఉ॥ కాలము తూలె వాగ్వ్యయము • గాఁగనుసించెను నిన్ను నేఁడుటల్
జాలము సేయఁ బోకుమిఁకఁ • జాలభవంబుల స్రుక్కినాఁడ నన్
బాలనసేయ లేరెవరుఁ • బాలనుముంచిన నీళ్ళముంచినన్
నీలలితాకృతిన్మదిని • నిశ్చయమెన్నుచునుంటిఁ గేశవా! 80

మ॥ ధరలో సత్తెనపల్లి దక్షిణమునం • ధన్యంబుగా నుండి సు
స్థిరతం జూడఁగఁ గంటెపూడి నగరిం జెల్వారగా నుండి నీ
కరుణం జేసితిఁ గట్టువారి నగరిన్ • గాపట్యముల్ లేక నేఁ
గరణీకంబును నీ దయన్ విధిగ విఖ్యాతంబుగాఁ గేశవా! 81

మ॥ రహినార్వేలకులుండనై చెలఁగి భా • రద్వాజగోత్రుండనై
బహుభక్తిన్నినుఁ గొల్చువాఁడనయి యా • పస్తంబ సూత్రుండనై
విహితంబొప్పఁగఁ గొల్తు నిల్లెమాయనిన్ • వేదామర శ్రేణులన్
సహజం బొప్ప నుతించుచుంటి నెపుడున్ • సన్మార్గికై కేశవా! 82

ఉ॥ పింగళి వంశవార్ధి శశి ♦ పేరున నొప్పిన సోమరాజుకున్
మంగళకీర్తిచే నెసఁగు ♦ మంజులభాషిని భద్రమాంబకున్
లింగశరీరుఁడైన దరి ♦ లీలను బుట్టెను మల్లికార్జునా
ఖ్యంగను నాకుఁ బుత్రుఁడను ♦ దక్కలి సేకడఁ జేరి కేశవా! 83

ఉ॥ ఆసువాసినీయ ధన్యుఁడనఘుఁ ♦ నారయఁగా సతి కామమాంబకున్
ధీమతి లెన్న నిద్ధరణిఁ ♦ జెల్లను గానుదయించినాఁడనన్
సామజరక్ష! యీ భువిని ♦ జక్కఁగ వేంకటసుబ్బరాయఁడన్
నామమునే వహించితి ♦ నన్నును గావలె వేగఁ గేశవా! 84

చ॥ కలియుగమైదు వేలపయిఁ ♦ గాంచఁగ నేండ్లు పదేడునయ్యెనా
నలలి శాలివాహను ప్ర ♦ శస్త శకంబు దిగగ్ని వస్విలా
కలమను సంఖ్యదాఁ జెనిదె ♦ తథ్యము కాలము దట్లు పోవుచున్
వెలసెను గాదె యిద్ధరణి ♦ వేమఱుఁ దెల్పఁగ నేఁ గేశవా! 85

మ॥ గరిమన్ శ్రీనలనామ వత్సరమునం ♦ గార్తీక మాసంబులోఁ
బరగన్ బూర్ణిమయందు నీకుఁ గృతిగా ♦ భాసిల్లుచుండన్ భవ
త్పరమానచ్ఛతకంబు నిచ్చితి మదిన్ ♦ భాస్వత్ప్రవంగాంచిని
చరణాబ్జంబులఁ జేర్చి నాకు శుభముల్ ♦ సంధింపవే కేశవా! 86

చ॥ వరదుఁడవై ననీకివుడు ♦ వాడని యుత్పలచంపకాదులన్
వరుసగఁ గూర్చినట్టి పరు ♦ వంబగు మాల సమర్పణంబుగా
హరి పరమాత్మ! యిచ్చితిన ♦ యాఘనకంఠమునందుఁ దాల్పవే
నరగున ప్రోచి నాకిడవె ♦ శాశ్వత మోక్షము నేఁడు కేశవా! 87

చ॥ రతనపు హారముల్ గలవు ♦ రాజసభానము నొందియుంటచే
నతులిత భక్తకోటియిడు ♦ నా కృతిహారములొప్పఁ దాల్పవే

పతితులొసంగ హారములు • పాలనఁ జేయు విరొట్టివైనసుక్
ధృతిగలదేవ! నామనవి • దృష్టిని నిల్పవె చాలఁ గేశవా! 88

చ॥ సవరణఁ జేయలేకమును • శాస్త్రములెల్లను నీకునిచ్చి రా
నవసరమైనచోటులను • నావిధి ద్దిదియుష్మదాజ్ఞచే
నివహముగూర్చి నీవయిని • నేనొక పాత్రముఁ జెప్పియుంటినీ
కవులకుఁ జూపకుండితిన • కారణమిత్రుఁడవంచుఁ గేశవా! 89

ఉ॥ కొందఱు చెప్పు కావ్యములు • గొప్పగవర్ధిలు వేణుపట్టులం
గొందఱు చెప్పు గ్రంథములు • కుంటగు నిత్తువుఁ బోలితియ్యనై
చెందిన కీర్తిఁ గాదె నినుఁ • జెప్పిన చోటుల నెన్ని చూడఁగాఁ
బొందుగ నీవు లేని కృతి • పోల్చగ వేణువు మూడిక్కఁ గేశవా! 90

చం॥ జపములనెన్ని చేసినను • జాలవ్రతంబులు గూడఁ జల్పినన్
విపులములైన కర్మములు • వేగనొనర్పినఁ దీర్ఘయాత్రల
త్యపరిమితంబు సేసినను • నాయపరోక్ష విశుద్ధ మార్గమున్
నిపుణతఁ గాంచఁ గాఁగలరె? • నిన్నుఁ దలంపక యెందుఁ
గేశవా! 91

చం॥ శ్వపచుఁడు సర్వకాలమును • సాధనతోఁ దన చూడ్కి దీక్షగా
నుపమునఁ జేర్చి నీవయిని • నూర్ధ్వముఖుండయి భ్రూస్థలంబునం
దపనుని తేజమట్లులను • హృదయంబునఁ గాంచుచుండినన్
శ్వపచుఁడె వాఁడు చూడఁగను • జాలపవిత్రుఁడు గాక కేశవా! 92

ఉ॥ లాలి భుజంగనాట్యమృదు • లాలస! యోగిహృదబ్జవాస! హే
లాలిదృఢాంగశూర! కమ • లాకర కౌస్తుభవక్షధార! హే
లాలిసుషేణవంద్య గుణ • లాలిత మేధవిశాలనేత్ర! యో
లాలి వికుంఠవాస! రిపు • లంఖిణి దైత్యవిఖండ! కేశవా! 93

ఉ॥ వారిధిగర్వభంగ! సుర • వాంఛలుదీర్చిన యార్తరక్ష! హే
సారసనేత్ర! ధీర! జయ • సంగరనిర్జర రక్షితాంగ! హే
ఘోర విరాధమార! ధృత • కుంజర పాలన! గోపలోలనా!
భూరివిచాపఖండ! సుర • భూజప్రపూజిత దేవ! కేశవా! 94

ఉ॥ వాలివిభంగ! దైత్యకుల • వల్లభ రక్షణ సన్నుతాంగ! శ్రీ
శూలిమహాధనుర్ద్వారణ • శోభితభృంగ! కృపాంతరంగ! హే
భీలదశాస్యహంత! సురరి • భీతినొనర్చుజగద్ధితాంగ! హే
పాల! కృపాలవాలఘన • పాండవపక్ష! నృసింహ! కేశవా!95

ఉ॥ రూఢిచెలంగ నాశబరి • రోయక కాచిన మేటివంచు బల్
గాఢతనంబు చే ధ్రువుని • కోర్కులు తీర్చిన మాధవంచు బల్
ప్రౌఢి చెలంగఁగా విదురు • పజ్జను విందులు గొంటివంచు నీ
గాథవు నిత్యకీర్తికిదె • క్రన్నన జేసుఁ బరాకు కేశవా! 96

ఉ॥ గంధవహాత్మజుండు బలు • కాంచన ఛత్రము నిల్వఁ బట్ట మేల్
బంధుర మొప్పఁ బాదుకలు • భక్తినినంగదుఁ డెత్తి మోయ నా
సంధివిభీషణార్కజులు • చామర యుగ్మముఁ బట్టి భక్తియున్
సంధిల వేయ వేత్రములు • జాంబవదాదులు పట్టఁ గేశవా!97

ఉ॥ చారుసుషేణుఁ డున్మగుల • సంభ్రమ మొప్పఁగ వెంట నంటి తూ
ణీరము నిచ్చుచుండ ధర • ణీస్థలి దిక్కులు పిక్కటిల్లఁగా
భూరిగ జానకీమణి యుఁ • బుష్పక మెక్కఁగ దండు గొల్వఁగాఁ
జేరి తయోధ్యకుం బ్రజల • చిత్తములుల్ ముద మొందఁ గేశవా! 98

ఉ॥ శ్రీకరిరక్ష! హే సుజన • సేవిత! సింధుగభీరవిక్రమా!
శ్రీకర! యాదిదేవ! భువి • శేఖర! చంద్రవిభాకరాక్ష! హే

ప్రాకటయోగముద్ర! • యరిభంజన! కౌరవవంశనాశనా!
యాకరమీ వినాకునిల • నత్తయమున్ గృపసేయఁగే కేశవా! 99

శా॥ దీనత్రాణపరాయణాయని మహా • దీనుల్ ప్రశంసింపఁగే
పై నెన్నండును జూడనట్టి ఘనయో • భద్రాను సంధాయకా
జ్ఞానంబానహిమత్తుఁడై జడుఁడనే • చందాన నిన్ గొల్వనా
ధ్యానంబెట్టుల నింపఁగల్గుదు జగద్రక్షా! ధరన్ కేశవా! 100

శా॥ శ్రీకృష్ణా! శ్రితపోషణా! భవహరా! • శృంగార రూపామృత
శ్లోకా! నిత్యనిరంజనా! సకల దిక్ • శోభాయశోలంకృతా!
పాకారిప్రముఖాఖిలామరనుతః • పాదాంబుజాతాహ్వయం
చేకాలంబునుతించుచిత్తమున నా • కీయంగదే కేశవా! 101

ఉ॥ నినువర్ణింపను నాల్గువేదములు మరా • నిశ్రేణి యే నేరద
న్నను నేనాపొగడంగలాఁడనయితిన్ • నామానసం బందునో
యనఘా! నిన్ను నుతింపఁగాఁదలఁతు న • త్యల్పంబిదం చెంచకే
కొను మనూ దీనజనావనా యశము నే • కూరన్ సదా కేశవా! 102

ఉ॥ చేసినతప్పులిన్నియని • చెప్పఁగఁజాలనవన్ని చేయఁగాఁ
జేసిన దోసమిత్యాదిరయు • చింతిల నేటికి నయ్యెఁ జో మొనా
దోసము లెట్లడంగునో కు • తూహలతన్ వచియింపుమయ్య నేఁ
జేసిదనట్లు కింకర వ • శీకర! నిర్మలభావ! కేశవా! 103